శ్రీశుభమస్తు.

అర్జునాభ్యుదయం బను (1391)

# * విజయ విజయము *

● * ●

గ్రంథకర్త:

ఆత్మకూరు

అంబటి లక్ష్మీనర్సింహారాజు

○ * ○

పండితులచే పరిష్కరింపఁబడి

తా॥ లగిశెట్టిపేట, అజపురము

పూస్కూరు వెంగారావు, బుచ్చన్న

ప్రభు ప్రముఖుల ద్రవ్య సహాయంబున

వరంగల్ రామన్నపేట

శ్రీనివాస ముద్రణాలయమున ముద్రింపఁబడెను

చిత్రభాను సం॥ చైత్రం. మార్చి 1942. ప్రథమ ముద్రణము 500

# విషయసూచిక

# పీఠిక.

ఈగ్రంథ కృతికర్తలు పూసుకూరువారను పద్మనాయకులు నాల్గుతరములనుండి వీరిపూర్వులు మహాదాతలు ప్రస్తుతము మ॥ రా॥ వెంగారావు బుచ్చన్న ప్రభులు ప్రసిద్ధులు వీరిగోత్రము రేచెర్ల గోత్రమనియు ఆరాట్లగోత్రమని వ్యవహరింపబడుచున్నది ఆరాట్లగోత్రమని కవి ప్రయోగించినాడు. ఈకవి యినిగేల దేశాయి ఆత్మకూరు నివాసి మ॥ రా॥ వెంకటశర్మరావు, వెంకటనరసన్న దేశాయి సంస్థానకవి (౧౦) గ్రంథములు శతక, నాటక, కావ్య, నవలలు రచించెను యీవంశీయు లేడుతరము లిటివరకు మహాకవులై ప్రసిద్ధిజెంది రితనికి హన్మంతరాజు ధర్మరాజు, సుందరరాజు, నారాయణరాజు అను నల్గురు కుమారులు తురుష్క హూణ కళాభ్యాసులు కవిత్వపరిశ్రమ జేయుచున్నారు హరి కృపచే లభించుగాక అంబటి వంశమాతెస తల్లి భాగీరథమ్మ తండ్రి సుందరరాజు భార్య రంగనాయకమ్మ రాజమానితుండగు యీకవి కిప్పుడు ౧౨ వత్సరములు వయసు చిరంజీవియై వర్ధిల్లుగాక.

ఇట్లు

మరింగంటి నరసింహాచార్యులు

మునుగలవీడు.



# కవుల యభిప్రాయములు

ఉ॥ కావ్యములెన్నియో కలియుగంబున బుట్టె ననేకరీతులా
కావ్యములుంగ రసోచితవి కాన పదార్థము లోటునిక్కమా
కావ్యము బాలవృద్ధులకు గానసీయము శాశ్వతమైదగున్
కావ్యములన్ననీకు శతకంబుల పోలించించితెన్నియో ॥

క॥ నీరచిత విజయ విజయము । భారతకథగాన చెవులపండువుగా నే
నూరూర జేయు చదివెద । వాటి రస శబ్ద గద్య పద్య స్ఫూర్తిన్॥

ఇట్లు
శ్రీ. బీ. నృసింహరంగాచార్యులు అవధాని నెల్లికుదురు

చ॥ ఇదియసమాన మియ్యది । కవీశ్వర మానసరంజకంబు ని
య్యదియె సుధీజనేప్సితము । నియ్యది భారతికున్నికపట్టు ని
య్యదియె రసాలవాలమని । యెంతయు నెన్నగజాలు సజ్జనా
భ్యుదయమితోధికంబుగ । మహోన్నతి జెందుత భూతలంబునన్॥

ఇట్లు
శ్రీ. బీ. ఆళమా శింగరాచార్యులు, నెల్లికుదురు

చ॥ అరసితి భట్టువంశజుల । నచ్చటనచ్చట కొందరిన్ మహా
సరసకవిత్వ చాతురి వి । చారగులన్ భువినెందు నీక్రియన్
నిరుపమ మాధురీ రసవి । నిర్మల గాంగనదీప్రవాహ వా
గ్గరిమగనంగ లేదు మృషగాదు । నరాభ్యుదయంబు జూపదున్॥

ఇట్లు
వెల్లుల రామగోపాలరావు రేకొండ బాలకవి.

గీ॥ విజయవిజయా ప్రబంధంబు । వినులార
వింటి కనుగొంటి రసశబ్ద । విభవఫణితి
వ్యర్థ పదదూర గద్య । పద్యార్థ పటిమ
వెలుగు నీకృతి । లక్ష్మీనృసింహరాజ!

ఇట్లు భాషాభిమాని:
కురికేల కేశవరావు. గుండి.

క॥ అభ్యుదయార్థంబుగ కర్ణాభ్యుదయము జెప్పి యర్జునాభ్యుదయము నా
లభ్యముగ జెప్పితివి సౌరభ్యము స్వర్ణమునకొదవి రాజిలుభంగిన్

ఇట్లు
కోట వెంకటనారసింహారెడ్డి, పాడుక.

లును, వేటపాలెం బి. బి. హెచ్. యం. స్కూలులో నాతోఁగూడ సహోపాధ్యాయులు నగు మ. రా. శ్రీ పేరాల రామమూర్తి పంతులుగారికిని, నాటకమును ముద్రింపించి సాయపడిన సి.బి. దాస్ త్యాండుకో వారికిని, మఱియు సకలవిధముల నాకుత్సాహమును గొల్పిన జన స్నేహితుల కెల్లరకును నామనః పూర్వక వందనములను సమర్పించు కొన్నాఁడను.

ఈనాటకమునందు లలితాపాత్రము నొక్కదానినే నేను గల్పించితిని. తదితర పాత్రములు, కథాకల్పనము, ఇందలి యొకటి రెండు జాబులును పీఠికలోఁ జెప్పఁబడినట్లు లాఖ్యాయికలోనివై యున్నవి. ఈతూరికి కాలవిలంబము లేకుండెను. కావున ద్వితీయముద్రణమున సమంజసములైన మార్పులు చేయఁబడగలవని విన్నవించు కొనుచున్నాఁడను,

నాటకముద్రణ సమయమున నేను తిరుమలగిరి యాత్రకరిగిన కారణమున ప్రూఫులైనను తిన్నగాఁజూచుకొనుట కవకాశముచాలదయ్యెఁ గావున నిందుదోసములుండవచ్చును. గుణగ్రహణ పారీణులు వానిని బాటింపక మంచినే గ్రహించెదరు గాత.

ఇట్లు,

విబుధజన విధేయుఁడు.

దూపాటి కొండమాచార్యులు,

గ్రంథకర్త.

వేటపాలెం,
26—8—25.

సీ॥ చీరాలవంశాబ్ధి • శీతకరుండౌచు
ప్రఖ్యాతిఁగాంచిన • భవ్యుఁడెవఁడు
అడుగకుండుటె లోప • మతఁడెల్లరికి తోడు
పడు నాప్తుఁడననొప్పు • ప్రాజ్ఞుఁడెవఁడు
తనమిత్రులకునెల్ల • దగుసాయమొనరించి
మెప్పులనందెడు • మేటియెవఁడు
ఆంధ్ర దేశాభ్యుద • యార్థమై యేవేళ
నాత్మ నాలోచించు • ననఘుఁడెవఁడు

గీ॥ వేంకటప్పయ సూనుఁడై • వెలసెనెవఁడు
గ్రంథముద్రణ మొనరించి • గ్రాలెనెవఁడు
అట్టి బైరాగిదాసుని • నాది దేవుఁ
డైన శ్రీకృష్ణుఁడోముత • ననవరతము.

ఈ నాటకకథలోని పురుషులు చాలమంది, కొందఱు స్త్రీలు కల్పితులు. చరిత్రప్రసిద్ధులగు నా కాలపువీరులు పెక్కండ్రు గలరు [illegible] వారినె పాత్రములుగఁ గొన్నచోఁ గథావస్తువున కింకను బటుత్వము సిద్ధించియుండును. ఆఖ్యాయికా ప్రయోజనము దృశ్యప్రయోజనము వేఱు వేఱని కథాకల్పనమున నాటకకర్తలు స్వాతంత్ర్యముఁ గొనుట యుక్తము.

ఈ నాటకమునఁ గథానాయకుఁడు కుమారసింహుఁడు. కథానాయిక ఏకవీర. ఈ దంపతులు కాకతీయసామ్రాజ్యము నేలు రుద్రదేవి స్వాతంత్ర్యమును గాపాడుటలో నద్వితీయ కృషిచేసి సార్థకులైరి. ఏకవీరచేసిన సాహసము ప్రకృతకథావస్తువునకు సర్వవిధములఁ బ్రాణభిక్ష పెట్టుచున్నది. మహేశ్వరీ త్రిపురాంతకుల పరిణయము, లలితారంగని వివాహము కథకనుకూల కల్పనములై మనోజ్ఞముగ నున్నవి. ఈ నాటకము చరిత్రదృష్టితోఁ జూచుటకంటె భావదృష్టితోఁ జూచుట యవసరము.

గ్రంథకర్త యీ నాటకమును మృదుమధురమగు శైలిలో సులలితముగ వ్రాసి యాంధ్రమాత కర్పించి కృతార్థుఁడైనాఁడు. చిరంజీవియగు నీగ్రంథకర్త బహుగ్రంథకర్త యగుట కాశీర్వదించుచు నింతతో విరమింతుము.

ఇట్లు,
సారస్వత సేవకులు,
శ్రీ శేషాద్రి రమణకవులు,
శతావధానులు Etc.

నందిగామ
21—8—25.

ఓం

# —* విజ్ఞాపన *—

---

సోదరసోదరీమణులారా!

నేను కొలఁది కాలముక్రిందట శ్రీ శ్రీ విజయనగర సంస్థాన కవీశ్వరులగు మ. రా. శ్రీ భోగరాజు నారాయణమూర్తి గారిచే రచియింపఁబడిన "ఆంధ్రరాష్ట్రము" అను నవలను జదివితిని. అందలి కథా కల్పనము మనోహరముగా నుండుటచే నదే యితి వృత్తముగ నెత్తి యొక దృశ్యప్రబంధమును వ్రాయవలయునని నాకొక యభిలాష గలిగెను వెంటనే నాయభిప్రాయము నెఱింగించుచు శ్రీ భో॥ నారాయణమూర్తి గారికి జాబువ్రాయగా వారును తమ నవలలోని కథను గైకొని నాటకమును వ్రాయుట కనుమతించుటయేగాక నన్ను మిగులఁ బ్రోత్సాహపఱచుచుఁ దామే పీఠికను గూడ వ్రాయ సంసిద్ధులైనట్లు దయతో జబాబు నొసఁగిరి. నేనును మిక్కిలి త్వరలో నాటకమును ముగించి పీఠికకై వారి కడ కంపితిని. కాని వారికాసమయమున శరీరమస్వస్థతగా నుండినందున శ్రమఁగలిగించుట కిష్టము లేక నాటకమును భారతీసేవాధురంధరులగు శ్రీశేషాద్రిరమణ కవులకంపగా వారు నాయందు వాత్సల్యము నుంచి వెంటనే పీఠికను వ్రాసిపంపిరి. నాప్రయత్నమున కెంతయు సంతసించుచు నాబాల్యమిత్రులును, ఉదారపురుషులునగు మ. రా. శ్రీ చీరాల బైరాగిదాసుగా రీనాటకమును ముద్రింపించి సరస్వతీకరుణాపాత్రులైరి.

ఈనాటకమును వ్రాయఁ బ్రోత్సాహపఱచిన మ. రా. శ్రీ భో. నారాయణమూర్తిపంతులుగారికిని, నాపురోభివృద్ధి నాకాంక్షించి సవిమర్శకముగ పీఠిక నొసంగిన శ్రీశేషాద్రిరమణ కవులకును, నాయత్నములకభినందించుచు కావలసిన పరికరముల సమకూర్చి యిచ్చిన నామిత్రు

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 2 | సడతలను | నడతలను |
| ,, | 7 | దీసుకొని | దీసికొని |
| 4 | 15 | దేవదేవభిధానమున | దేవదేవాభిధానమున |
| 6 | 10 | తసకిచ్చిన | తనకిచ్చిన |
| 7 | 16 | ఆంద్రమాత | ఆంధ్రమాత |
| 8 | 5 | గుత్రైటంగిన | గుర్తైటంగిన |
| 9 | 7 | సుబోధకము | సుబోధకములు |
| 11 | 1 | త్రిపురాంత దేవుఁడు | త్రిపురాంతక దేవుఁడు |
| ,, | 2 | ఆంధ్ర | ఆంధ్ర |
| ,, | 7 | అరచేత | అఱచేత |
| ,, | 10 | యోచించక | యోచించక |
| ,, | 13 | చేరువున | చేరువ |
| 12 | 4 | కండె | కంటె |
| ,, | 8 | దారిద్రాంబుధి | దారిద్ర్యాంబుధి |
| ,, | 14 | పెంచుకొనిన | పెంచిన |
| ,, | 27 | ముసుముందు | మునుముందు |
| 13 | 12 | యరమైలు | యఱమైలు |
| 14 | 20 | గానవచ్చెడు నిప్పుడీ కాననంబు | రమ్యమైయొప్పె నిప్పు డారామసీమ |
| 15 | 9 | యసాపన | యసాపన |
| ,, | 24 | వంశనినాద | వంశీమనోజ్ఞ |
| ,, | 27 | జవ్వని | భామినీ |
| 16 | 22 | మధుపక్షికమ్మ | మధుమక్షికమ్మ |
| 19 | 24 | కన్నియవమ్మ | కన్నియవౌదొ |
| ,, | 25 | సారసనేత్రి | సారసనేత్ర |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 23 | 3 | రాచకార్యము | రాచకార్యము |
| 24 | 9 | రాజీవనేత్రి | రాజీవనేత్ర |
| 27 | 11 | మెల్లడల | మెల్లెడల |
| ,, | 13 | విరహిణుల | (గన్నియల |
| 28 | 24 | వచ్చుచునట్లున్నది | వచ్చుచున్నట్లున్నది |
| 29 | 10 | తున్నావే | తున్నావే |
| 33 | 3 | అప్రయత్నలపూర్వకము | అప్రయత్నపూర్వకముగ |
| 37 | 1 | వాడై నేమి | వాఁడైన నేమి |
| 40 | 10 | ప్రకటమొనర్చు | ప్రకటనసేయు |
| 41 | 4 | నతివలార | నరిగివత్తు |
| 47 | 22 | తక్షణమే | తత్ క్షణమే |
| 56 | 12 | అవనిక | యవనిక |
| 59 | 29 | మూగివాడు | మూఁగవాఁడు |
| 67 | 15 | ప్రతాపదేవుడే | ప్రతాపదేవుఁడే |
| 70 | 10 | విశేముల | విశేషముల |
| 71 | 3 | నాథు | నాథు |
| 74 | 6 | అపగింపని | అప్పగింపని |
| 81 | 12 | రాసి | రాశి |
| 85 | 3 | కేగుసు | కేగును |
| 88 | 17 | ఆబల | అబల |
| 90 | 24 | ఇదివఱకే | ఇదివఱకే |
| 94 | 9 | ఛండాలుని | చండాలుని |
| 104 | 15 | సమయముసకైన | సమయమునకైన |
| 106 | 26 | నడుగనేల | నడుగనేల |
| 111 | 3 | వరస్రాద | వరప్రసాద |

శ్రీ

# నాటక కథాసంగ్రహము.

---

## —*ప్రథమాంకము*—

1. ఆంధ్రసామ్రాజ్యమును విధ్వంస మొనర్ప నుద్యుక్తులైన పాండ్య రాజ జైనాచార్యుల నడతలనుగూర్చి చింతించుచు త్రిపురాంతకుఁ డాహవ మల్లుని వేషమున జైనాశ్రమమును జేరఁబోవుట

2. ఏకవీర తన చెలికత్తెయగు లలితతో నుద్యానవనమున విహరించుచుండఁ గుమారసింహుఁ డామెనుగాంచి మోహించుట.

3. రుద్రాంబ తీర్థయాత్రకై మొగిలిచెర్లకేగ నిశ్చయించుకొనుట. తనకుమార్తె లెంత్రచెప్పినను తానేకవీరను వెంటదీసుకొని పోవుటకు సమ్మతింపనందునఁ గుమారసింహుఁడు చింతిల్లుట.

## —*ద్వితీయాంకము*—

1. రుద్రాంబ సైన్యాధిపతియగు ప్రతాపదేవుని దురాలోచన. దేవి యింట లేకుంటచే తనకుమారుఁడగు నాగరాజునకు దుర్బోధనలఁగావించి యేకవీరను మోహింపుమని చెప్పివంపిన విషయమును స్మరించుకొనుచు దనలోఁదాను సంతసించుట.

2. ఏకవీర విరహమునఁ గుందుచుఁ దనమనోహరుడగు కుమారసింహుని ధ్యానించుచుఁ గూరుచుండియుండ నాగరాజచ్చటికి వచ్చి యామె ననేకవిధములఁ బ్రార్థించి తిరస్కరింపఁబడుట.

3. ప్రతాపదేవుఁడు తనకుమారుని తెలివిలేమికి విచారించి తానేకవీరను చంపుదుననియు, తీర్థయాత్రయందున్న దేవినిఁ బట్టుకొనుట కడు సులభమనియు, మఱల నేకశిలానగరమునఁ బ్రవేశింపకుండ దేవినితో

వలోనే తుదముట్టింపుమనియు జైనాచార్యుని కొకజాబు వ్రా నుంచి దన సేవకుఁడగు బిజ్జలునికై బయటికేగుట. ఇంతలో నా టికివచ్చి జాబును సంగ్రహించుకొనిపోగా వానినెట్టులో వ జాబులాగికొని జైనాచార్యుని కంపుట.

4. త్రిపురాంతకుఁ డాహావమల్లునివేషమున జైనాచార ము. నెల్ల నెఱింగి యతనినుండి పాండ్యరాజున కొక జాబును దీ పోఁవ నట్లాజ్ఞాపింపఁబడుట.

## —*తృతీయాంకము*—

1. రుద్రాంబ కుమారసింహునితోడను తనయలఁ మొగి చెర్లలో నేకవీరాదేవిని సేవించుచుండ శాత్రవులుపైన త్రిపురా తకుఁడు సోమదేవుఁడై వచ్చి రక్షించి కుమారసింహు ం గానక కుఁడుటచే వానిని వెదకఁబోవుట.

2. మున్ను జైనాశ్రమమున నాహావమల్లుని సంపాది త్రిపురాంతకుఁ డతిభద్రముగదాచియుంచిన జా గహించుకొ యేకవీరతానేస్వయముగ పురుషవేషధారియై పా జుకడకేగుట.

3. ఏకవీర దేవదేవభిధానమునఁ బాండ్యరా తనప్రియుఁడ కుమారసింహుఁ డచ్చట చెఱసాలయందున్న కొనుట.

4. పాండ్యరాజ దేవదేవులు దీనదశయం ఏకవీరానామసం రణ మొనర్చుచున్న కుమారసింహునిఁగా దేవదేవుఁడు కుమా సింహుని ప్రాణరక్షణోపాయమును ని పాండ్యరాజ దోడుకొనిపోవుట.

5. ఏకవీర కుమారసింహునకుఁ బ నర్చుచు నాతని క వచ్చిన క్రమమును దెలుపుట.

## —* చతు *—

1. రుద్రాంబ తనమంత్రియ వయ్యతో తనకు తీర్థయా యందు గలిగినకష్టములఁ జై తాపదేవుని నేకవీర విషయ

ప్రశ్నించుచుండఁ దనకు గృహశత్రువు లున్నట్లు తెల్పుచు త్రిపురాంత కునకు జాబునంపుట.

2. త్రిపురాంతకుఁడు తనరహస్యములనెల్లఁ గనుగొను చుండెనని ప్రతాపదేవుఁ డీతూరిస్వయముగ జైనాశ్రమమునకు బయలుదేరుట.

3. అపహార్యమగు తనజాబును గొంపోయిన వారెవ్వరో తెలియక త్రిపురాంతకుఁడును రంగడునుఁ చింతిల్లుచుండ నాగరాజేక వీరను [illegible] నచ్చటికి వచ్చి పట్టువడుట. భటులు జైనాశ్రమము నుండి [illegible] ప్రతాపదేవుని గూడి బంధించి తెచ్చి త్రిపురాంతకున [illegible]

4. దేవదేవుఁడు లోగడఁ దనకు మహేశ్వరి వ్రాసినజాబును చదువుకొనుచుండ దాసియొకతె వచ్చి కేళీకాగారమునఁ గూర్చుండి పాండ్య రాజుగారు రమ్మనిరని చెప్పి తోడ్కొనిపోవుట.

5. పిలువఁబంచినది పాండ్యరాజుగారని భయపడుచుఁ బోయిన దేవదేవుని మహేశ్వరి వరించుట.

6. పాండ్యరాజ దేవదేవులు సంభాషించుకొనుచుండ "కుమారసింహునిఁ బ్రాణములతో నాకర్పింపనియెడల క్షమింప" నని తెల్పుచు రుద్రాంబ ఘన్నునిచే జాబునంపుట.

7. పాండ్యరాజు మోసమునరయఁజాలక పరమసంతోషమునఁ గుమారసింహ దేవదేవులను తన సైన్యాధిపతులుగ నియమించుకొనుట.

—* పంచమాంకము *—

1. ఘన్నుఁడు త్రిపురాంతకునితోఁ గుమారసింహ దేవదేవుల క్షేమమును జెప్పి లలితామనోధవుఁడగు రంగడచ్చటనే యున్నట్లు విని సంతసిల్లుట.

2. జైనాచార్యుఁడు త్రిపురాంతకునిఁ బట్టుకొమ్మని తెల్పుచు నొక ఋషికుమారుని వేషమునఁ దన సేవకునిఁ బాండ్యరాజుకడకంపుట.

3. పాండ్యరాజు త్రిపురాంతకునిఁ బట్టుకొని వచ్చుటకై కుమారసింహ దేవదేవుల నియోగించుట.

4. పాండ్యరాజు దేవదేవుని వరించినందులకై, తన కూతురగు మహేశ్వరిని దుర్భాషలాడి విసుగుఁజెంది వెళ్లిపోగా దేవదేవుడు వచ్చి మహేశ్వరికి ధైర్యమునుగొల్పి తనతోఁగూడ నామెను పాండ్యరాజ్యమునుండి దాటివేయుమని బోధించుట. మహేశ్వరి సమ్మతించుట.

5. త్రిపురాంతకుఁడు జైనాశ్రమ విధ్వంసమొనర్చి చెలికాండ్రతో మాటలాడుచుండ। మహేశ్వరితోఁగూడ యుక్తిచే శత్రుగృహమునుండి తప్పించుకొనివచ్చిన కుమారసింహ దేవదేవులు గలిసికొనుట. ఒండొరుల సంతోషము.

—* షష్ఠాంకము *—

1. త్రిపురాంతకుఁడు మహేశ్వరిపై మరులుగొనియాలోచించుచుండ వెంకన్న దేవదేవుడు తనకిచ్చిన రాజముద్రలను తెచ్చియాతని కిచ్చుట.

2. రాజముద్రలను ధరించిన త్రిపురాంతకుని మహేశ్వరి దేవదేవునిగా భావించి మాటలాడుచుండ దేవదేవుడరుదేరుట. మహేశ్వరివారిరువురిలో తన మనోహరుఁడెవ్వడో గుర్తింపజాలక ప్రశ్నింపుచుండఁ గుమారసింహుఁడరుదేరి వారిసంభాషణకుభంగముఁగావించి శత్రువుల నెదుర్కొనుటకై వారినిఁదోడ్కొనిపోవుట.

3. దేవి గాయములబాధచేఁ బరుండియుండ ఛన్నుఁడామెకు యుద్ధవిశేషములఁ దెల్పుచుండుట. ఆంధ్రులకు విజయము సమకూరుట.

4. దేవి దేవదేవుని నేకవీరగాను, ఛన్నునిలలితగాను దెలిసికొని సంతసించి యెల్లరిని సన్మానించుట.



# శ్రీమదాంధ్రవిజయము.

## నాంది

ఉ॥ శ్రీరమణీమణీవిమల • చిత్తవశీకరణుండు చిన్మయా
కారుఁడు భక్తలోక శుభ • కారణుఁ డాద్యుఁ డనంతుఁ డాపదు
ద్ధారకుఁ డచ్యుతుండు భవ • తారణనాముఁడు గోపికామనో
హారుఁడు కృష్ణమూర్తి సకలాంతరవర్తి శుభంబులీవుతన్॥

సీ॥ కృష్ణవేణీ పినా • కిని గౌతమీనదుల్
హారంబులుగ దేన • నతిశయిల్లు!
మహిత దాక్షారామ • మంగళగిర్యాది
పుణ్యస్థలుల కెద్ది • పుట్టినిల్లు!
నిఖిల మహాకావ్య • నిర్మాణధుర్యులౌ
కవివతంసుల కెద్ది • కన్నతల్లి!
పరమ పతివ్రతా • భవ్యచారిత్రల
కనవరతం బెద్ది • యమృతవల్లి!
గీ॥ భక్తవర్యుల కెయ్యది • పట్టుకొమ్మ!
తగఁబరీక్షింప నెది • సంపదలకు నెలవు!
అమ్మహాతల్లి రూపంబు • నాత్మనిల్పి
ఆంధ్రమాతకు వందనం • బాచరింతు!

సూత్రధారుఁడు:—(నాంద్యంతమున నంజలిఁబట్టి) మహాశయులగు నో సభాసదులారా!

గీ॥ ఆర్యవర్యులు వినుతింప • నతిశయింపు
సంపదలఁ దులదూగుచు • సర్వధర్మ
మార్గముల గుత్తతీంగిన • మానధనుల
కాంధ్ర దేశాభిమానుల • కంజలియిఁది!

(పుష్పాంజలి సమర్పించి)

ఆహా! నేఁడు మదీయభాగ్యమేమి! సకలవిద్యా పారంగతులగు పండితోత్తములును, రాజకార్యధురంధరులగు లౌకికోద్యోగస్థులును మఱియు రసగ్రహణ పారీణులగు పౌరశిఖామణు లెల్లరును నొక్కచో నేకకాలమునఁ జేరియుండఁ గన్నులపండువుగఁ జూడగల్గితిని. అదిగో! బాలు రదేవేళయైనదని కరతాళముల నారంభించిరి. (తెరవంకజూచి) నటి! ఒకమాటిటురమ్మ.

నటి—(పాడుచుఁ బ్రవేశించి) ఆర్యా! నమస్కారము! ఏమియాజ్ఞ ?

సూత్ర—లోన నలంకారములు ముగిసినవా?

నటి—ముగియవచ్చినవి. నాథా! ఇప్పు డే నాటకమాడి సభాస్థారుల నానంద కందళిత హృదయారవిందులఁ జేయనూహించితిరి?

సూత్ర—ప్రేయసీ! సభాసదు లెల్లరును “మున్ను పురాణగాథలనెన్నిటినో నాటకరూపమునఁ జూచి యున్నారము. నేఁడు మన యాంధ్రులకు సంబంధించినదియు, దేశభక్తపూరితమును, నానారసభరితమును, అగు చారిత్రక నాటకమునొండుఁ బ్రదర్శింపుఁ”డని నాకాజ్ఞయిచ్చి యున్నారలు. కావున నేడాంధ్ర విజయమను నాటకము నాడఁ దలంచితిమి.

నటి—బాగు. నాథా! నాటకనామమును వినుట మాత్రము చేతనే నాకొక వింతయగు నావేశము కలుగుచున్నది. అందును మన సోద

రులగు నాంధ్రుల చరిత్రయే యగుటచే నిది కడుంగడు రమ్యముగ నుండు ననుటలో నేమియాశ్చర్యమున్నది! నాథా! ఇది యేకాలము నాటి చరిత్ర?

సూత్ర—పదమూడవ శతాబ్దాంతమున శ్రీమద్రుద్రమదేవి పరిపాలనా సమయమున జరిగిన కథావృత్తాంతమిద్ది. నాటి యాంధ్రమహాజనుల శౌర్యధైర్యాది గుణములును, న్యాయమార్గానుసరణమును, నాగరికతాప్రభావమును, రాజభక్తియు దైవభక్తియు నిందు సుబోధకముగాఁ గలవు.

నటి—ఐన నిందలి కథయంతయుఁ జరిత్రలోని దగునా?

సూత్ర—ప్రేయసీ! అట్లుకాదు. మాతృకనుమాత్రము చరిత్రమునుండి సంగ్రహించి రసపోషణకై కావలసిన కల్పనలఁజేర్చి కూర్పబడి యున్నది. కథనంతయుఁ జెప్పుట కిపుడవకాశము చాలదు. ప్రదర్శనమును గాంచఁబోవుచు వేరె యడుగనేల!

నటి—పోనిండు. గ్రంథకర్త యెవరు?

సూత్ర—ఎవ్వరని యడిగెదేల! ఆతని నామము విబుధులెల్లరకును సువిదితమే.

సీ॥ శ్రీరమానాథు కరుణచేఁ • జెలఁగు వాఁడు
సంస్కృతాంధ్రాంగ్ల భాషా వి • శారదుండు
సాధ్వి రంగాంబ రాఘవా • చార్య సుతుఁడు
పరగ పేరాపాటి కొండమా • చార్య సుకవి!

నటి—సరి. నాథా! ఇపుడింకఁ గర్తవ్యమేమి?

సూత్ర—ప్రేయసీ! నాటక ప్రారంభమున ఋతువర్ణన మవసరముగదా. ఈ వసంతమునుగూర్చి పాడి శ్రవణేంద్రియముల కానంద మొదఁగూర్పుము.

నటి—సరస సంగీత విద్యావిశారదులగు తమయెదుట నాపాట యేపాటి చేయగలదు? ఐనను తమయాజ్ఞయైనదిగాన నానేర్చిన కొలఁది పాడెదను.

చం॥ అలరులఁ దేనె లానుచు మహాకుతుకంబునఁ దేంట్లు ఝంకృతుల్
సలుపుచు మన్మథాగమన • సంజ్ఞలఁ దెల్పఁగ మావిగున్నపైఁ
గులుకుచుఁ గోయిలల్ చెలఁగి 'కో' యని హారతిపాటఁ బాడ నె
చ్చెలులనుగూడి హాయిగ వసింత్రు వసంతదినంబులం బ్రియుల్॥

సూత్ర—సుందరీ! నీవర్ణన మతిమనోహరముగ నున్నది. అదేమాటము.

ఆ॥ వె॥ చతురమతినతండె • జైనాశ్రమము జాడ
వెదకికొనుచు మారు • వేషమూని
వచ్చుచున్నవాఁడు • వైరినిర్మథనుండు
అతివ! కనుమదె త్రిపు • రాంతకుండు.

కావున మనకిటనుండఁ జనదు. పోదమురమ్మా.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





# ఆంధ్ర విజయము.

## ప్రథమాంకము,

1. రంగము: ఏకశిలానగర పరిసరారణ్యము.

(త్రిపురాంతదేవుఁడు మాఱువేషమునఁ బ్రవేశించును)

త్రిపు—ఆహా! యెంతటి విపరీతములు సంభవించుచున్నవి! ఆంధ్రసామ్రాజ్యమున కెట్టి యిక్కట్టులు గలుగనున్నవి! దుర్మార్గుఁడగు నీ జైనాచార్యమాతకుఁడెంతటి మాయావి! మహాపతివ్రతా శిరోమణియు వైరివీరసంహారిణియునగు శ్రీరుద్రమదేవి సింహాసనాసీనయై యున్నందుల కేవగింపుచున్న పాండ్యచోళాది సామంత భూకాంతుల నరచేత నిడికొని తానీ కపటనాటకము నాడించుచున్నవాఁడు. కటా! యీమాండలిక రాజులకీ దుర్బుద్ధియేలజనించెను? జటవర్మసుందరపాండ్యమహారాజు మొదలగువారు స్వదేశక్షేమమును గుఱించియు, స్వప్రజాభివృద్ధిని గుఱించియు నించుకయైన యోచించక నన్యదేశీయులగు దేవగిరి యాదవులకుట్రలలోఁ బాల్గొనుచున్నారఁట. "వినాశకాలే విపరీతబుద్ధిః" అను లోకోక్తిననుసరించి వీరలకు వినాశకాలము చేరువున నుండుటచేతనే యిట్టివిపరీత బుద్ధులు పుట్టుచున్నవి. ఔరా! యీపాపాత్ములనేమిచేసిన నేమి?

ఆ॥ వె॥ జన్మభూమి కెగ్గు • సల్పు ఖండాలురఁ
బట్టి ప్రాణములను • వాయఁగొట్టి
స్వజనములకు నెల్ల • సౌఖ్యంబుఁ గూర్చుట
కంటె పుణ్యమొండు • గలదె పుడమి!

ఈనా సదుద్యమంబునకు సకలార్తత్రాణపరాయణుండగు శ్రీమన్నారాయణుండుతోడై మనోరథసిద్ధి సమకూర్చుఁగాత!

ఈనాశరీరము దేవిచేఁ బోషింపఁబడినది. వెలనాటిని సందర్శింప వచ్చినప్పుడు దీనురాలగు నాజనని దారిద్ర్యాంబుధింగూలి దక్షిఁగానక నన్నును నాచెల్లెలగు నేకవీరను, ఆయమ్మపాదముల పయింబడ వైచెను. దేవియు కావలసిన ధనసహాయము నొసఁగి యేకవీరను తనకడనుంచి పెండ్లిచేయుటకును తనభక్తి విశ్వాసములఁజూపినచో నాకొకగొప్ప యుద్యోగము నిచ్చెదననియుఁ జెప్పియున్నది. ఆమెయొసఁగిన సాయమునకిదే నాకృతజ్ఞతనుజూప సమయము వచ్చినది, ఆమెపెంచుకొనిన యీశరీరము నామెసేవకే వినియోగించెదను.

క॥ కూటికిని గుడ్డకు నొసంగి • కూర్మితోడ
నన్నుఁ బెంచినయట్టి ఋణంబుఁదీర్ప
సమయమిరుదెంచె నిప్పుడు • శాత్రవులను
గూల్చి దేవికి ముదమును • గూర్చువాఁడ!

(హస్తమునంగల ఖడ్గమునుజూచుచు) ఓశస్త్రరాజమా! ఇందు నీ సాయ మత్యవసరముగాన నప్రమత్తతం జరియింపవలయును సుమా!

మ॥ ఖలులై ద్రోహమటంచు నెంచకయె విఖ్యాతింబ్రపాలించు నా
లలనారత్నము రుద్రమాంబనెదలో • లక్షింపకే దుర్మతుల్
కలతంబెట్టఁగ సిద్ధమైరిపుడు త • త్కౌటిల్యసంచారులన్
బలిగాఁజేసియు నాంధ్రమాత కిడు సౌ • భాగ్యంబులక్ శస్త్రమా!

ఆంధ్రసామ్రాజ్యమున కంతరాయములఁ గల్పింపనుంకించుచున్న యీకుతంత్రపరాయణుల రక్తధారాస్వాదనంబునం దనివిఁజెంది యానందింపగలవు. నీపంటపండినదిలెమ్ము. మునుముందానాచార్యుని జాడఁగుర్తెఱుంగవలసియున్నది. నేఁడాపాండ్యభూపాలుని భటుఁడగు

నాహవమల్లునినుండి నాకు లభించిన యీజాబు విజయమార్గమును సూచింపుచున్నది. ఆహా! జైనాచార్యుఁ డెంతటి తంత్రజ్ఞుఁడు! బ్రహ్మాదుల కెఱుంగరాని యొకసాంకేతికస్థలము నేర్పఱచుకొని దూతలచే రహస్యములనెల్ల నెట్లు పసిపట్టుచున్నవాఁడు! నే నీయుత్తరము నాధారముగఁ జేసికొని యొక విచిత్రనాటకము నాడవలసియున్నది. ఓహో! ఆహవమల్లుఁ డెఱింగించిన మార్గమునుబట్టి చాలదూరమువచ్చితిని అవే ఆతఁడు వచించియున్న జైనాశ్రమప్రాంత చిహ్నములు బయల్పడుచున్నవి!

గీ॥ విమల సలిలప్రపూర్ణమై • వెలయుకొలను
కొలని కెలనను గలిగిన • కొండగుహలు
గుహలనంటిన తరులతా • గుల్మములును
గోచరములయ్యె నవిగో దృ • క్కులకు నిపుడు!

ఇంక నొక యరమైలు దూరమేగిన జైనాశ్రమముఁ జేరినట్లే! కాలవిలంబమేల? సాయంసమయముఁ గూడనైనది.

సీ॥ లేతపచ్చికమేయు • లేళ్ళసమూహముల్
సరభసంబున నేగ • సాగెనవిగొ!
బారుబారులఁదీర్చి • పక్షిసంతతులవే
కూయుచుఁబోయెడు • గూండ్లకిపుడు!
అపరదిక్కామిని • యతిక్రోధమున రక్త
వర్ణంబుఁదాల్చి గ • న్పడెడునదిగొ!
సాంధ్యరాగంబులు • జగమంతటను నిండి
యఖిలంబు స్వర్ణమ • యంబుఁజేసె!
గీ॥ పశువులను దోలుకొనుచును • బాడుకొనుచు
నింటికిని గోపబాలకు • లేగుదేర
వేళయును నయ్యె; తేజంబు • వీడియదిగొ
నబ్జమిత్రుండు తానదే • యస్తగిరికి!
కాన నిదే త్వరితగతినిఁ బోయెదను.

(నిష్క్రమించును.)

2 రంగము: అంతఃపురారామసీమ.

(ఏకవీర సాలోచనయై ప్రవేశించును)

ఏక—ఆహా! ప్రకృతి సౌందర్యము! అనుబంధము 1.

తేగీ॥ దేవదేవుమనోహర • తేజమటుల
దినదినంబును జూచుచు • న్నను నదేమొ!
ఎప్పటికి నప్పుడే యొప్పు • నివ్వనంబు
నవనవోల్లాసములతోడ • నవ్యమగుచు!

జగచ్చిత్రకారుఁడగు భగవానుని రచనా కౌశల్యమునుగూర్చి చర్చింప నేనెంతటి దానను? వేదాంతవిదులకు సైతము తెలియరానట్టి యమ్మహామహుని శక్తినభివర్ణింపనాకుఁ దరమా!

సీ॥ ఏవంకఁగనుఁగొన్న • నావంక వికసిత
పున్నాగమాధవీ • పుష్పచయము.
ఏతట్టుపోఁడఁగన్న • నాతట్టు చెవులకు
విందొనర్పుచుఁబాడు • భృంగచయము
ఏవైపుపరికింప • నావైపుకోమల
తరులతావళుల సౌం • దర్యసరణి
ఏదిక్కుమరలిన • నాదిక్కుచల్లనై
మసలుచుండెడు మంద • మారుతంబు

గీ॥ భళిర! సకలసుకవిజన • ప్రకరములకు
వర్ణనీయార్హమైనట్టి • వైభవంబుఁ
గలిగి సకలపక్షికులైక • నిలయమగుచుఁ
గానవచ్చెడు నిప్పుడీ • కాననంబు!

వీనినెల్లఁ జూచినకొలఁది నామనోవికారము లంతకంత కధికము లగుచున్నవి! ఇపుడు మదీయాంతరంగంబునఁ బొంగి పొరలుచున్న భావముల బహిరంగపరచుటకుఁ దగిన భాష నాకు స్ఫురించుటలేదు. అదిగో! నాచెలి లలిత యిటే చనుదెంచుచున్నది.

(లలిత ప్రవేశించును.)

లలిత—చెలీ! ఒంటరిగ నిట నీవేమి చేయుచుంటివి?

ఏక—పుష్పములఁగోసికొందమని యిచ్చోటి కరుదెంచునరికి ప్రకృతిరామణీయకము నన్నాపివేసినది.

లలి—చిత్రవిచిత్ర సన్నివేశమగు ప్రకృతి నిన్నాహ్వానించిన దనుటలో నాశ్చర్యమేమున్నది?

ఏక—చెలీ! మనమొకింతసేపాగి యిచటి వింతల నరయుదము. అదే? ఆరసాలమును గనుము.

చం॥ కలికి! కనుంగొనంగదవె • కానన సీమకు వన్నెఁ దెచ్చుచున్
వెలసిన దేవకన్య గతి • వేడుక మీరఁగఁగానవచ్చు నీ
లలితనవీన యౌవన క • ళల్ వెలిబుచ్చుచు నిల్చియున్న కో
మల తరురాజమున్ మహిత • మంగళమూర్తి రసాలసాలముౌ

లలి—ఆహా! నీ వర్ణన మత్యంత ప్రశంసనీయము. ఈరసాలము నొక యౌవనావిర్భూతయగు కన్నియకు సరిపోల్చితివి. అట్లైనచో నీకిది సోదరి కావలయునుగదా!

ఏక—ఓసీ! నీమాటలకేమిగాని, అదే ఆదిక్కునుండి శ్రవణానందముగ వినవచ్చెడు నాగానము నాలకింపుము.

లలి—ఏమి! ఆగానమాధుర్యము.

గీ॥ సాంధ్యరాగంబులంగాంచి • స్వాంతమునను
నచ్చెరువునంది పాడెడు • యక్షకన్య
గానమోయేమొ యిచ్చోట • వీనులకును
విందొనర్చుచు నదె విని • పించుచుండె!

ఏక—లలితా! ప్రపంచజ్ఞానమించుకయు లేనట్లు మాటలాడెదవేమి? నీవనినట్లు మనకు వినవచ్చుగానము యక్షకన్నియదికాదు. వినుము

సీ॥ శ్రీరాగలోలుఁడౌ • చిన్నిగోపాలుని
వంశనినాద రా • వం బనంగ
కల్యాణి శారదా • కన్యాలలామంబు
వాయించు వీణార • వంబనంగ
మోహనాకారయౌ • మోహినీ జవ్వని
గాన గంగా తరం • గం బనంగ

ఆనంద భైరవి • బ్రాంతిఁపగాఁ జూచు
వనదేవి కంఠరా • వంబనంగ
గీ॥ మలయమారుత మెల్లెడ • మసలుచుండ
ప్రాణులెల్లను హాయిగాఁ • బరఁగుచుండ
లలన! కోయను కోకిలా • లాపరవము
నెగడు చున్నది దిక్కుల • న్నిండియిపుడు!

లలి—మదవతీ! మదనుని దాతయగుటచే నీవది వెంటనే గుర్తించగలిగితివి. ఇంక నా సూర్యభగవానుని కిరణప్రసారముచేఁ గడుంగడు భాసమానములై యచ్చటచ్చటం గానవచ్చుచున్న యారామగృహముల నవలోకింపుము.

ఏక—ఓసీ! అయ్యారామగృహంబులపై నల్లిబిల్లిగ నల్లుకొనిన లతామతల్లికలును, ఆలతలయందు విరాజిల్లుచున్న వివిధవర్ణ కుసుమంబులును నయనానందకరములై యొప్పారుచున్నవి.

లలిత—ఇంకను బరికింపుము. ఇచటి నానావిధ లతాంతములు మధుమక్షికమ్మల కాశ్రయస్థానము లగుచున్నవి. అదే! ఆఝుంకార నినదము నాలకింపుము.

ఏక—చెలీ! ఈచిత్రమును గనుము. పాపమీ తేటి సూర్యకర ప్రతిభచే పుష్పముఁవలెఁ గానబడుచున్న సమీపమందలి యాశ్యామలపత్రమునఁ బ్రవేశింపఁజూచుచున్నది. నిజముగ నదియొక పుష్పమనియు తానందలి మధువును గడుపారఁ ద్రావవచ్చుననియు దీనియుద్దేశము కాఁబోలు!

ఉ॥ ఓమధుపక్షికమ్మ! యిటు • లూరకఁ బుష్పముగాఁ దలంచి తే
జోమహనీయమూర్తియగు • సూర్యకరప్రతిభన్ వెలుంగునీ
శ్యామలపత్రమందిపుడు • హర్షమునం జొరజూచుచుంటి వీ
వేమి మరంద మందుఁ గొనెదే! పశుబుద్ధిని వెళ్ళఁబుచ్చితే!

లలి—ఏమది! ఇందా భ్రమరమెట్టి తప్పుఁజేసెను. దూరమున కాపత్రి మట్లగపడుటచే భ్రిమఁజెందెను. జ్ఞానప్రపూర్ణులమని చెప్పుకొనెడు

మానవులే యొకొక్కప్పుడు పై డంబములనుబట్టి కొందరిని దాతలుగ భావించి పొరబడుచుందురు. అట్టిచో నీ తేటిదేపాటిలోపము?

ఏక—అయిన నిక నీపత్రిమునదే లోపమా? దాని నైజమట్టిదైయుండ తా నేమిచేయఁగలదు?

గీ॥ తేనెగలచోటులకుఁబోయి • తృప్తిదీరఁ
గడుపునిండించుకొనక నీ • గతినివృథగ
మృదుమధుర గీతములబాడ • నేలఁజెపుమ!
తేటిరో తెల్వి లేమినిఁ • దెల్పుకొనుచు॥

లలి—చెలీ! ఈ తేటి నాధారముగ గైకొని లోకమునకు నీతులఁ గఱపుచుంటివా? ఇట్టి యుపన్యాసములకుఁ గడంగుచో మనకు విలంబము కాఁగలదు. సూర్యాస్తమయము లోపల నంతఃపురమును జేరవలయును. గాన నా దెసకుఁగూడఁ బోయి యచటి చిత్రములఁజూచి వత్తము రమ్ము. (ఏకవీర చేయిఁబట్టుకొని కొంతనడచి యాగును)

(మఱియొక వైపునుండి కుమారసింహుఁడు ప్రవేశించును.)

కుమార—నేడు నాసోదరుడగు నన్నమదేవునినుండి సెలవు గైకొని బయలు వెడలినది మొదలు నాకనేక శుభములుతోఁచుచున్నవి ఇదిగో మరల నా దక్షిణహస్త మదరుచున్నది. కారణమేమై యుండును? ఆంధ్ర సామ్రాజ్యమున కనేకకష్టముల నమకూర్ప యత్నించుచున్న దుర్మార్గులనెల్ల మదీయ నిశితఖడ్గంబున కెరజేసి దేవికి విజయంబు గల్పింప విధి సంకల్పించెనా యేమి! లేకున్న నింకేమి కారణమున్నది. కానిమ్ము. దానికింత విచారణయేల? రానున్నది రాక మానదుగదా!

మొత్తముమీఁద నేననుకొనిన సమయమునకంటెముందుగా నేయీప్రదేశమునకుఁ జేరఁగలిగితిని ఆహా! యిటఁజల్లనిగాలివీచుచు మదికిమిగుల నుల్లాసము గొలుపుచున్నది. ఇందొక్కింతసేపు విశ్రమించెదను.

(విశ్రమించును)

ఏక—(కుమారసింహుఁడు విశ్రమించిన దిక్కు, జూపుచు) లలితా! ఈ పొదలమాటుననుండి యచటి యిసుకతిన్నె వంకఁజూడుము.

లలి—(చూచి) అచ్చోట నెవ్వరో యొకపురుషుఁడు విశ్రాంతిం జెందు చున్నట్టు లున్నది.

ఏక—ఆ మారసుందరాకారుడెవ్వడని తలంచెదవే?

లలి—చేలీ! ఇంతకు మున్నీతనిని నేనెన్నఁడును జూచియుండనట్లున్నది. కాని దేవి చెప్పిన చొప్పునఁ గుమారసింహుఁ డరుదెంచెగాబోలు. అతఁడు గాక పరపురుషుండెవ్వఁడింత నిర్భయముగ నీయంతఃపురారామసీమయందు విశ్రమింపగలఁడు? కుమారసింహుఁడే నీకొఱ కిట నొంటరిగ వేచియుండనోపు!

ఏక—ఓసీ! నీపరిహాసములకేమిగాని మఱి పుష్పములఁ గోయవలయును గదా. ఆపనియైనచో నిక మన మింటికి మఱలవచ్చును.

లలి—ఆచెంత ననేకవిధములగుపుష్పములున్నవి. కాని యచటి ముండ్ల పొదలవెంట నీవు నడువజాల వాగుము. నేనువెళ్ళి వలయునన్నిటిని గోసికొనివచ్చెదను. నీ విచ్చటనెయుండుము.

ఏక—ఒంటరిగా నన్నిందుండుమందువా?

లలి—ఏమిభయమమ్మా! పట్టపగలు! క్షణములోఁదిరిగివచ్చెదనుండుము.

(నిష్క్రమించును)

కుమార—(వినుటనభినయించి) ఇచట నెవ్వరో మాటలాడుచున్నారు. ఒకవేళ మావదినె లేమైన విహారార్థ మిటకు వచ్చిరేమో. వినోదము జేసి వీఁని నవ్వించెదను. (తేఱిచూచి) ఏమిది! ఈనారీశిరోమణి యెవ్వాతె యైయుండును? వదినలలో రుయ్యమ్మయుఁ గాదు, ఉమ్మక్కయుఁగాదు. భ్రమించుచుంటినా!

గీ॥ రమణి రూపంబుదాల్చి యా • రామసీమఁ
దిరుగుచున్నట్టి యవ్వన • దేవియేమొ!
కాకయుండిన సామాన్య • కాంతలకును
జక్కదనమింత గల్గునే • జగతియందు॥

(అనుబంధము 2.)

ఆహా! యీకన్యకామణి లావణ్యము వర్ణనాతీతము. ఈమెనుస

జించిన యవ్విధించి మంచి నేర్పరికదా, ఆతఁ డెంతశ్రమఁజేసి యీ తటిల్ల
తను సృజియింపఁగలైనో!

ఉ॥ శారదరాత్రులన్వెలుఁగు • చంద్రునిగేలి యొనర్చు మోము నొ
య్యారము మీఱవాంచి దర • హాసమొనర్చుచు మాటిమాటికిన్
జారుచునున్న పైఁట నదె • చక్కనసేయుచు నోరచూపుసిం
గారముతోడ నొప్పెసఁగెఁ • గాంత తటిల్లతభంగి నివ్వెడన్

ఏక—ఈ పురుషసింహునిఁ గాంచినది మొదలు నామనోవికారమునకు మేర లేకయున్నది. ఈతని సౌందర్యాతిశయము నెట్లు వర్ణింప నలవి యగును.

(అనుబంధము 3.)

ఉ॥ నాణెములైనముత్యము ల • నందగి ఘర్మకణంబు లెంతో వి
న్నాణముఁజూప వెల్గు వద • నంబును వక్షము నూగుమీసముల్
జానువులంటు హస్తములు • చక్కని కన్నులు యౌవనాగమం
బైన విధంబుఁదెల్పు దర • హాసము నామది నాఁటె నివ్వెడన్
త్రికరణశుద్ధిగ నామనంబీతని యందు లగ్నమైనది.

కుమార—(తనలో) నేనెద్దియో పొరఁబడుచున్నట్లున్నది. మాయత్తగారగు రుద్రాంబమందిరమున నాకుంబరిచితులుకానివా రెవ్వరు? దాపున కరిగిచూచినచో నిక్కాంత యెవ్వతెయైనదియుఁ దేటపడగ లదు. (దాపున కరిగి) ఈమె ముఖారవిందమును బరికించిచూడ నా కెద్దియో జ్ఞాపకము తోచుచున్నది. మున్నొకప్పుడీమె నెచ్చటనైన జూచియుందునా? ఎట్లెఱుంగనగును? అడిగి తెలిసికొనినఁ దప్పేమి? (ప్రకాశముగా) ఓ కన్యకామణీ!

ఉ॥ ఓరమణీమణీ! యిటుల • నొంటిగ నివ్వనభాగమందు సం
చారముఁజేసెదేల! పరి • చారికలెవ్వరు లేకయుంటకున్
గారణమేమి? నీ వెవరి • కన్నియవమ్మ యెఱుంగఁజెప్పుమీ
సారసనేత్రి! సద్గుణవి • శారద నేను కుమారసింహుఁడన్॥

ఏక—(తనలో) ధన్యాఽస్మి; మనమా! ఇంక నీకేమికొఱంత? ఎవ్వని కొఱకై నీవిన్నిదినములనుండి పరితపించుచుంటివో అట్టి నీకుమార

సింహుఁడు నీకు లభ్యమయ్యెను. నీకింక నితరలోకముతోఁ బనియే మికలదు? (ప్రకాశముగ) ఆర్యా! ఎవ్వతెవని యడుగనేల? ఈమె మీా చరణదాసియె.

ఆ॥వె॥ దిక్కు మ్రొక్కు లేక • దీనయై స్రుక్కుటఁ
గాంచి దీని నేను • గాతునంచు
దేని తెచ్చి పెంచె • దేవి యబ్బాలిక
యిచ్చువందనంబు • లివిగో! గొనుము

కుమార—(తనలో) దేవి యట్టివారి నెవ్వరినిఁ గొని తెచ్చి పెంచుచున్నది? (జ్ఞాపకము నభినయించి) ఓహో! ఈమె త్రిపురాంతక దేవుని చెల్లెలే. సందేహము లేదు. మొక్కట్టు లట్టులే గన్పట్టు చున్నవి.

(తెరలో)

చెలీ! ఏకవీరా! పుష్పములఁ గోయుట పూర్తియైనది. ఇంక నింటికి మఱలుదమా?

ఏక—(తనలో) అయ్యో! ప్రియునితో ముచ్చటగ సంభాషించుకొనుట కనువుపడకుండ నీ నెచ్చెలి యింతలోనే వచ్చె నేమి?

కుమార—కంఠధ్వనినిఁబట్టి యీపిలుచునది లలితయని తెలియ వచ్చుచు న్నది. (బిగ్గఱగా) లలితా! నీ నెచ్చెలింజూచుకొని కుమారసింహుని మఱచితివా!

లలిత—(ఆతురమున వచ్చి సంతోషాతిశయమున) కుమారసింహా! ఇవే వందన శతంబులఁ గైకొనుము. ఇంక ముందెప్పుడో మొగిలి చేర్గకుఁ బోయి యేకవీరాదేవి యనుగ్రహమును బడయవలెనని దేవి సంక ల్పించుకొనినది. నీభాగ్యమేమో! యేకవీరాదేవిసేవ నీకిప్పుడే లభ్య మైనది. ఇంక నీ కే యభీష్టము నెఱవేఱకుండును?

కుమార—(తనలో) నిశ్చయముగ నాతలంపుగూడ నదియే.

ఏకవీర—ఓసీ! లలితా! యేమిపరిహాసము లాడెదవింక! పోదముపద.

లలిత—చాలు లెమ్ము! ఆమాట నీమనసు నుండి వచ్చుచున్నదా? ప్రియుని వదలి నావెంట నీవెట్లు రాఁగలవమ్మా?

కుమార—లలితా! ఏమి నీమాటలు! ఇరువురను గలసి నన్ను వదలి

పోఁదలంచితిరా యేమి? మందిరమున కందరమును గలసియే పోవుదము.

లలిత—కుమారసింహా! మార్గాయాసమున నీ మేను డస్సినట్లున్నది. నీ యీ ధూళిధూసరిత గాత్రమును పరిశుభ్రము జేసి యలజడి నుపశమింపఁజేయ నీదాసి యేకవీర సంసిద్ధయై యున్నది. సత్వరముగ మందిరమున కేగుదమురమ్ము. చెలీ! ఏకవీరా! నీమనోనాథుండు నీకుఁ జిక్కినాఁడుగదా! నీకింకేమి కొఱదువ? నీ ప్రణయ మహిమచే దేవి యంగీకారముగూడ సులభ్యము కాఁగలదు. వెళ్లుదమురమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

మూఁడవ రంగము. సభామందిరము.

ప్రవేశము: రుద్రాంబ, కుమారసింహుఁడు, ఉమ్మక్క, రుయ్యమ్మ.

రుద్రా—నాయనా! కుమారసింహా! నిన్నింత త్వరితముగా నిచ్చటికిఁ బిలిపించిన కారణము నిప్పటికి గ్రహించితివి గదా! త్రిపురాంతక దేవుఁడంపిన జాబునుబట్టి నీవేమి యూహించెదవు?

కుమా—జైనాచార్యుని మర్మగృహమును గనిపెట్టుటకై త్రిపురాంతకుండు తనయావచ్ఛక్తిని వినియోగించు చున్నవాఁడు.

రుద్రా—అందులకు సందేహమేమి? ఆతఁడు మనయెడలఁ గనబఱచు భక్తివిశ్వాసములు ప్రశంసాపాత్రములు.

ఉమ్మక్క—అమ్మా! నిశ్చయముగఁ గుమారసింహుఁడుతప్ప మన పరివారమునం దంతటి శూరాగ్రేసరుఁ డెవ్వఁడో చెప్పుము.

రుయ్య—అక్కా! కుమారసింహ త్రిపురాంతకులు దేవికి బాహుద్వయంబుగఁ దనరుటచేతనే రాజకార్యనిర్వహణ మీమెకు సులభసాధ్యమగుచున్నది.

కుమార—అత్తా! త్రిపురాంతకుఁడు మనకిపుడు తెలిపిన విషయముల నెల్లఁ దీవ్రముగ విచారించి చూడ నీవిపుడే ప్రయాణ సన్నద్ధవగుట సమంజసముగ లేదని నాయభిప్రాయము.

రుద్రాం—ఉమ్మక్క గర్భముఁ ధాల్చినది మొదలుగ వడ్డెపల్లెకుఁ బోయి యచటి బుద్ధగణపతిని సేవించి 'ఆంధ్రసామ్రాజ్యము

నవిచ్ఛిన్నముగఁ బరిపాలింపఁగలసూనుని దయచేయు'మని ప్రార్థించి పిమ్మట మొగిలిచెర్లకేగి యేకవీరాదేవినిఁ గొలిచి వత్తుమని సంకల్పించుకొని యుంటిని. ఆ నా కోరిక యిట్టి యాటంకముల వలన నే నేటి దనుకఁ గెఱవేఱ కున్నయది. ఈమారెట్టులైనఁ బోయిరాక తప్పదు.

కుమార— ఎట్టులో యింతకాలము విలంబమైనది. ఇచటి యల్లకల్లోలము లొక్కింత తగ్గిన పిమ్మటఁ బోయి రాఁగూడదా? మీప్రయాణము శత్రువులకెట్టి యవకాశమునిచ్చునో; దాననేమి కీడుమూడునో యని నాయనుమానము.

రుద్రాం— ఇట్టి యనుమానముల మనసునకుఁ బట్టించుకొనుట చాల తప్పు. భగవద్విషయముగ మనము ప్రయాణ మగుచున్నప్పుడు యిక్కట్టులెట్లు మనల సమీపింపఁ సాహసింపఁగలవు? అదియుఁగాక నొకవారము దినములలోనే తిరిగి వచ్చెదము. ఇంతలో నేమి విశేషములు పుట్టఁగలవు? శివదేవాదులు గూడ వలదనిచెప్పినను నేను వినలేదు. ఈమారితప్పక వెళ్ళి రావలయుననిసంకల్పించుకొన్నదానను.

కుమార— (తనలో) ఇఁక నెంతచెప్పినను లాభము లేదు. ఈమె కాగ్రహము వచ్చునేమో. నే నూరకుండెదను.

ఉమ్మక్క— కృపాణపాణియై కుమారసింహుఁడు వెంటనుండ మనకెట్టి యాపదయుఁ గలుగనేరదు.

రుయ్యమ్మ— (మందహాసముతో) ఏకవీర తోడలేని దీకుమారసింహుఁ డొంటరిగ వచ్చుటకు సమ్మతించునా?

ఉమ్మక్క— ఏకవీరగూడ మనతో బయలుదేరదా?

రుద్రాం— (ఆలోచించి) అమ్మాయీ! ఆవిషయమై దూరమాలోచింపవలయును. ఏకవీర మనతో బయలుదేరుటకు నేనెంతమాత్రమును నాయంగీకారము నీయఁజాలను.

కుమార— (తనలో) ఇదేమిపాపము! ఏకవీరను వదలిపోవలసినదేనా?

ఉమ్మక్క— (తనలో) దేవిమాటలు వినఁగనే పాప మీకుమారుని మోము దీనత్వమును సూచింపుచున్నది. ప్రియావిరహము దుస్సహ

ముగదా! ఎట్టులైన మాతల్లి నొడంబఱచి యేకవీరనుగూడఁ దీసికొని పోవఁ బ్రయత్నించెద. (ప్రకాశముగ) అమ్మా! విచారమాలోచించు టకిది యెట్టిరాచకార్యము? ఏకవీరం గొంపోయినం దప్పేమి?

రుయ్యమ్మ—పాపమామె యొక్కతె యింటికడ నెట్లుండఁగలదు? ఆమె లేనిది కుమారసింహుఁ డుత్సాహముతో రాఁగలఁడా? మనసు నేకవీర కర్పించి రావలసినదే.

కుమార—వదినెగా రేమిపరిహాసము లాడెదరు?

రుయ్యమ్మ—ఏమి! యిదిపరిహాసమా! విరహభారమును వహింపఁగల సమర్థత నీకడనున్నచో నే నూరకుండెదను.

కుమార—విరహపరిచితులరగు తమ రెఱుఁగని దేమున్నది.

రుద్రాం—అబ్బాయీ! నామాటవిని యేకవీరను ప్రయాణమొనర్చు విషయ మీతాతూరికి మానుకొనిన సంతసము.

కుమార—(తనలో) ఏమిచేయుదును? దేవిమాట కెదురాడ వలనుపడదు గదా. (ప్రకాశముగ) నేనిప్పుడేమంటిని? తమకడ్డుఁజెప్పుట కెట్లు సాహసింతును?

రుద్రాం—(తనలో) ఏకవీర కుమారసింహుల యన్యోన్యానురాగమును నే నెఱుంగకపోలేదు. కుమారసింహున కేమహారాజకుమారినో పెండ్లిసేయక యేకవీరను గూర్చినచో వానియన్నయును నా కల్లుఁడునునగునన్నమదేవున కేమికోపమువచ్చునో? ఈసమయమున బంధువిరోధముఁ గూడనెత్తిపెట్టుకొనినచో నికఁ జెప్పెడిదేమున్నది. అందుచే నెట్టులైనఁ గుమారసింహుని కేకవీరపైనున్న వ్యామోహమునుదగ్గింప యత్నింపవలయును. ఒకరికొకరుదూరముగనున్నచో నేమిమార్పు కలుగునో చూచెదను. (ప్రకాశముగ) కుమారా! ప్రయాణ ప్రయత్నముల నొనర్పవలసియున్నది. నీవందులకు సంసిద్ధుఁడవు గమ్ము. బిడ్డలారా! మీరుగూడ కావలసిన దుస్తులుమొదలగు వానిని సవరించుకొనుఁడు.

పోదము రండు.

(కుమారసింహుఁడు వెనుకనిలిచియుండ తక్కినవారు లోనికేగుదురు)

కుమార— అనుబంధము. 4

అబ్బా! ఇంక నీవిరహాబ్ధిందరియింప మార్గమెద్దియో తోఁచుట లేదు. ప్రియా! ఏకవీరా ఎందరెన్నివిధములఁ దెల్పినను నిన్నువెంట గొంపోవుటకు దేవిసమ్మతింపదయ్యె. నేనుమాత్ర మామె యాజ్ఞనుశిర సావహించిపోకఁ దప్పదుకదా! అంతమాత్రమున మనసార నిన్నువదలి పోదలంచితినని తలంపకుము.

గీ॥ ప్రాణసఖియరో! నీముఖ • పద్మమొకటె
యాశ్రయస్థాన మయ్యెనా • యంతరాత్మ
కకట! నీస్వాడియేగెడు • నట్టిదాకఁ
జీవవిరహిత తనువె రా • జీవనేత్రి!
(నిష్క్రమించును.)

—* గద్య *—

ఇది శ్రీ మద్రమారమణ కరుణావిశేషసంలబ్ధ కవితాధురీణ
శ్రీమాన్ దశాపాటి కొండమాచార్యప్రణీతం బైన
శ్రీమదాంధ్ర విజయంబునం
ప్రథమాంకము.
ఓమ్.



# ఆంధ్రవిజయము.

## ద్వితీయాంకము.

---

1. రంగము; ఏకాంతస్థలము.

(ప్రవేశము: ప్రతాపదేవుఁడు)

ప్రతాప—వహ్వా! యేమినాబుద్ధికుశలత! ఈదెబ్బతోరుద్రమ్మ చేతిలో జిక్కిన దన్నమాటయే. లేనియెడల నింతకండకావరమా? మగఁడు చావఁగనే తానుగూడ చచ్చినట్లోకమూలఁ గూర్చుండి యుండక తగుదునని మగరాయనివలెసింహాసనము నధిష్ఠించుటేల? జ్ఞానవిహీన! స్త్రీ! అందునను విధవ! ఈముండకు లొంగియుండుట వీరపురుషాగ్రగణ్యులమగు మాకుఁ దలవంపులుగ నుండలేదా! ఈముండపరిపాలనమింకెన్నిదినములులెమ్ము. పాండ్యభూపతియు జైనాచార్యుఁడును నావలననిచటి సర్వరహస్యములను దెలిసికొనుచు సమయమునకై వేచియున్నారు. దేవగిరిప్రభువగుమహాదేవరాజుగూడ మాకుసహాయమైవచ్చుచున్నాడు. ఎల్లరమునుగూడి దీనిరాజ్యమును మూడునిముసములలో వశపఱచు కొనలేమా.

పోనీ! స్త్రీయైననేమి! సింహాసనాసీనయైననేమి? విచక్షణాజ్ఞానమిసుమంతయైన నలవడెనా? అదియును లేదు. రాజబంధుఁడను, సైన్యాధిపతిని. నాకుఁదగిన మర్యాదలొనర్చుచుండవలదా! ఇన్నియెందులకు? లోకానుభవముఁ గలవాఁడగుటచేతనే యమ్మహాకవి సుమతీశతకమున

"క౦॥ కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండబెట్టి • శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁగట్టిన
వెనుకటి గుణమేలమాను • వినురాసుమతీ!"

అనిచెప్పియున్నాఁడు.

నామనోవీధిని బ్రజ్వరిల్లుచున్న పరిభవానల మీఁముండనుగాల్చి వేయకుండునా? ఈపెకుఁదోడుగఁద్రిపురాంతకుఁ డెచ్చట దాపురించెను. అయిననేమి? నాచేతఁ బడకుండఁ ద్రిపురాంతకుఁడెక్కడికి తప్పించుకొని పోఁగలఁడు? మఱచితిని. ఇంకనాకుమారునిఁ జంపుటకై యిప్పుడు నేనొనర్చెడు ప్రయత్నము ప్రశంసాపాత్రము. ఓహో! ఇదియేమి? నాకుమారునే నెను చంపఁబోవుచుంటినా? కాదుకాదు. పొరపాటు. కుమారసింహుని జంపుటకై యనుటకుమాఱునా కుమారునిఁజంపుటకై యని నోట వచ్చెను. అమంగళ మప్రతిహతముగుఁగాక. అప్రతిహతమా! అయ్యో! ఇదేమిప్రారబ్ధ మిట్టిపొరపాటు మాటలునోటవచ్చు చున్నవి. ఈతడ బాటు మాటల పాటిసేయుట నాబోటికార్యవేదులకుఁగూడ సరియగునా. దానికేమి? కుమారసింహునిఁ జంపుటకు వేఱె యాలోచ యేటికి? రుద్రాంబ యేకవీర నొంటరిగ నింటవిడచి ప్రయాణమై పోవుటయు నాకుమంచి యుపకారమేయైనది. నాకుమారుఁడగు నాగరాజునకామెపై మోహము గలిగించిపంపించితిని. నాకూన నాముద్దుల నాగరాజేకవీరను వలలోఁ బడవైచి కొనఁ గలఁడు. సందేహము లేదు. ఏకవీరను నాగరాజునకు వివాహమొనర్చితినేని కుమారసింహుఁడు మోహాతిశయమున శుష్కించి యసువుల వీడఁగలఁడు. త్రిపురాంతకుఁడు తన చెల్లెలగు నేకవీరకు కీడు జేయఁజూడఁడుకదా. మానాగరాజుకు బావమఱది యైనపిమ్మట నాతఁడిక దేవికి విరోధి కాఁగలఁడు. నాకాప్త బంధుఁడగును. ఇంకనాంధ్రసామ్రాజ్యము నాయఱచేతిలోని దగునుగదా! కుమారసింహుఁడు శుష్కించి గతించును. త్రిపురాంతకుఁడు మెల్లగ నావైపునకు మఱలును. పిమ్మట దేవియేమి చేయఁగలదు? పక్షచ్ఛేదమైన పిమ్మటఁ బక్షి యెచ్చటి కెగురఁగలదు?

కం॥ తెక్కులు రెండును విఱిగిన
నెక్కడి కేనియును విహంగ • మెగురంగలదే?
చక్కటియాలోచన కిం
కెక్కడి యాటంకమున్న • దిలలోనెందున్.

ఇంతటి దూరదృష్టితో నేనొనర్చెడు నాయాలోచనల కంతరాయములఁగల్పింప బ్రహ్మాదుల కలవియగునా!

ఏకవీరను పరిపఱచుకొనుటకై మానాగగా జీ పాటికే యుద్యానవనమునఁ బ్రవేశించియుండును. ఆతడుతిరిగి వచ్చిననెగాని ముందు విషయమున కాలోచింప ననువుపడదు.

(నిష్క్రమించును.)

2 రంగము: ఉద్యానవనము.

(ఏకవీర నెలరాలతిన్నెపైఁ గూర్చుండియుండును.)

ఏక — లయగ్రాహి

మల్లెలును మొల్లలును గొల్లలుగనెల్ల పొదరిళ్ళపయినల్లి మదినుల్లసముగొల్పన్
చల్లనయిమారుతము వల్లరులనుండి మెలమెల్లనఁ జరించిజగమెల్లడల నిండన్
పల్లవిని బాడి యల నల్లనను దేంట్లు సుమవల్లరులఁజేరి విలసిల్లుటలు జూడన్
పెల్లుగను విరహిణుల యుల్లముల నెంతయును దల్లడిలఁజేయునికఁ జెల్లదిటనుంటల్॥

అబ్బా! ఇచ్చటిరామణీయకములెల్ల మన్మనోవికారము నంత కంత కభివృద్ధి నొందించుచున్నవి. ప్రియుఁడునన్నుఁ గొంపోవుట కెన్ని ప్రయత్నములొనర్చినను దేవిసమ్మతింపదయ్యెను. మఱల నామనోహరుని సందర్శన సౌభాగ్యమెన్నఁటి కబ్బునో! నాకిట నిముస మొక్కయుగంబుగఁ దోచుచున్నది. మొగిలిచెర్లకేగి ఏకవీరాదేవిని మన్మనోభీష్టసిద్ధికై ప్రార్థింప నోచకపోయితినిగదా. మనమా! కానిపనికి వగ

చిన నేమిఫలము? అమ్మహాతల్లి యేకవీరాంబ యేడలేకున్నది? నీవిపు డామెనేలఁ బ్రార్థింపరాదు?

ఓ జగజ్జననీ!

గీ॥ సర్వకాలఁబులను బ్రపం • చంబునెల్ల
పరమకారుణ్యమునను గా • పాడుజననీ!
ఏకవీరాంబ నానమ • స్కృతులఁ గొనియు
నన్నుఁబ్రియుఁగూర్పఁ గదవమ్మ • కన్నతల్లి!

ఓ తల్లీ! నీకృపచేతనే నాతలిదండ్రులు నన్నుఁగాంచి యుండిరట. ఆకారణము చేతనే నాకును వా రేకవీరయను నామధేయము నిడి యుండిరి.

మన యిరువురిపేరు లొక్కటియె! అయినను నదృష్టములు వేఱు లుగదా! పావనీ నన్ను దయఁగనుము.

(అనుబంధము. 5)

(వినుట నభినయించి) ఓహో! మన్మథోద్దీపకమై పికరావ మెల్లదిక్కులఁ బిక్కటిల్లుచున్నది. ఓపికమా! ఏటికిటుల నాపైఁ గసు లెత్తుఁజేసెదవు? విరహిణులపై బింకములఁ జూపుట నీకు నైజముకాఁ బోలును! తత్సంబంధమైన పాప తమసమే నీ శరీరమునకీ బొగ్గురూపమును గల్పించియుండును. కాదేని యానారీమణుల శాపాగ్నినింధనమవై కాగియిట్లైననై యుండ వచ్చును.

గీ॥ లలితచిగుళ్ళను మెక్కి క • లస్వనమునఁ
"గో"యనుచుఁ గూయనేమయ్యెఁ • గోకిలంబ!
పాంథజనుల కొనర్చెదు • పాపమెల్లఁ
గట్టికుడుపకపోదు ని • క్కమ్ముసుమ్ము!

ఇతరుల జోలి నీకేల! నీమనోహరుని నీవుగలిసికొనుము. పోమ్మ ఏమది! యెవ్వరో యిటువచ్చుచునట్లున్నది. ఎవ్వరైయుందురు (శబ్దము వినవచ్చెడు ప్రక్కకుఁ జూచుచుండును.)

నాగరాజు రోజుచుఁబ్రవేశించును.

నాగ—(పరమసంతోషముతో)అమ్మా! నాయనా! నాపంటపండిందిరా.

బాబూ! ఏకవీరా! నీదర్శనంకోసర మెన్నాళ్ళనుంచి కష్టపడుతున్నానే! నాతపస్సంతా యివ్వాళఫలించినది. అబ్బబ్బా! తిరిగితిరిగికాళ్లన్నీ గుదులు పట్టిపోయినవి. అయితేయేం. నిన్నుచూచే సరికన్నినొప్పులూ యెగిరిపోయినవి. నేపడిన పాట్లన్నిటికీ కనికరించి యేదీ ఒకముద్దియ్యి (సమీపించును.)

ఏక—(కొంచెమావల కేగి తనలో) వీఁడుప్రతాపదేవుని కొడుకైన పిచ్చి నాగరాజై యుండును. (ప్రకాశముగ) ఓరీ! నీవెవ్వరి పిల్లవాఁడవు? నీపేరేమి?

నాగ—నేనా! నేనా! ప్రపంచంమీద నన్నుతెలియనివాళ్ళున్నారా! వింతగామాట్లాడుతున్నావే. నేను ప్రతాపదేవుని ముద్దులకొడుకును గానూ; నాపేరునాగరాజుకాదూ? నీలాంటిఅందకత్తెలందరూ నన్ను రతిరాజని గూడా అంటారే. ఆసంగతైనా తెలియదా నీకు. దాని కేంగాని మళ్లీఆరిపోతుంది. ఎదీ! తొందరగా ఒక్క వేడి వేడి ముద్దియ్యి.

ఏక—ఓరీ! మొద్దూ. నీకుముద్దుగావలయునా? నీముద్దుముక్కలుగాను ఇక్కడనుండి వెళ్లెదవా లేదా?

నాగ—(తనలో) ఇలామాట్లాడితే "అప్పుడామెను బ్రతిమాలుకో"మ్మని మానాన్నచెప్పాడు గాదా (ప్రకాశముగ) ప్రేయసీ! ముద్దుగుమ్మా! చక్కెరబొమ్మా! చిలకరామా! ఓసరోకాదే. ఆ. చిలకలకొలికీ! అయ్యో! మానాన్నచెప్పిన వరుసమఱచానే ఆ. జ్ఞాపకంవచ్చింది, ఓనవమోహనాంగీ! చక్కనిచుక్కా! బంగారు బొమ్మా! నన్ను కటాక్షించాలె. నాకునీకన్న దిక్కెవ్వరున్నారు చెప్పూ.

ఏక—ఓరీ! త్రాగుబోతువలె నోటికివచ్చినట్లు ప్రేలెదవేమి? నీకు ప్రాణములపై నాసయుండియె మాటలాడుచుంటివా?)

నాగ—(తనలో) మానాన్నచెప్పినట్టు యీమెకు కోపంవచ్చిందే; ఇక నేను చెయ్యాలిసినపని—ఆ. బెదరించటంగాదూ. సరే సరే. (జ్ఞాపకము తెచ్చుకొని ప్రకాశముగ) ఒసేవు. నీకే మంచిమాటలతో చెప్తూఉంటే పట్టటం లేదే. ఇదిగో! చూశావా [కత్తినిచూపును]

ఇదేమిటనుకొన్నావో! మరొకటి మరొకటనుకొన్నావేమో. ఎంత పొడుగుందో కనుక్కున్నావా? కత్తి. ఇకమఱి మాట్లాడు చెప్తాను.

ఏక—ఓరీపక్షీ! నీకుతోడాకకత్తిగలదా! చూచెద నేదీ [ఖడ్గమును లాగికొని] ఇంకనోరెత్తిచూడుము. నిన్నీఖడ్గమునకు బలియిత్తును.

నాగ—[వడకుచు] ప్రేయసీ! నన్నుచంపుకుంటావా? అయ్యయ్యో! నావల్ల తప్పేమున్నది? మానాన్న నీకప్పజెప్పిరమ్మన్న పాఠమంతా మాటపోలు పోకుండా చెప్పతూవున్నాను. నాతప్పా అది! చెప్పు.

ఏక—[తనలో] ఓరీ! ప్రతాపదేవా! దేవిలేదుకదాయని యిట్టి పన్నుగడల పన్నుచున్నావా. కానిమ్ము. [ప్రకాశముగ] అటులైనచో నికనోరెత్తక యింటిమార్గమును బట్టిపొమ్ము. ప్రాణములఁ దక్కించుకొమ్ము.

నాగ—సరేలే. అలాగేపోతాగాని మరినాకీపాటి వుపకారఁ చేయలేవూ. నన్ను పెండ్లిచేసుకుందూ. నన్నుగట్టిగ కౌగలించుకొని నాచలి దీర్చుదూ. నీకుక్కను. ఎట్లాచేయమంటే అట్లాసేస్తాను. చూడు. నీకు నేను విధేయుణ్ణి సందేహిస్తావేమో. దృష్టాంతం కావాలంటే చూసుకో. ఇదిగోసాష్టాంగ నమస్కారంచేస్తున్నాను. (ఏకవీరపాదముల పైబడి స్మృతిదప్పును.)

ఏక—వీడు మొద లేపిచ్చివాఁడు. తండ్రిదుర్బోధనలచే మఱింత మదోన్మత్తుడై యున్నవాఁడు. ఈపిచాశమునుండితప్పించుకొనుటకిదియె సమయము. వడివడిగ నంతఃపురమున కరిగెదను. [నిష్క్రమించును]

నాగ—[తెలివితెచ్చుకొని కళ్లునలుపుకొనుచు] ఏకవీరా! ఏకవీరా! సతి! ప్రియా! ప్రేయసీ! అయ్యో! యెక్కడాకనపడవేమి. నన్నువదలి పెట్టిపోయినావా? నేనొంటరిగా బ్రతుకగలనా! పాదాలుకూడావత్తుతానంటినే. నీయిష్టమువచ్చినట్లు యేమిచేయమన్నా చేస్తానంటినే. అబ్బా! ఇంతకనికరము లేదేమి? అయ్యయ్యో! ప్రాణాలు పోతున్నవి. తొందరగారా. రా. (నవ్వుచు) ఆ. ఇపుడునాకు తెలిసిందిలే. తమాషా చేస్తున్నావా? ఎక్కడో దాక్కొని నాకు నీమీద నిజంగా

ప్రేమ వున్నదో లేదో పరీక్ష చేస్తున్నావా? ఇన్ని మాటలనుకున్నావా నావి. ఏకోశానా నాకు చలనమనే మాటయుండదు. అబ్బబ్బా! ఏమంటావు మఱి! ఈవిరహాన్ని యికభరించడం దుర్లభం. ఇకమఱి ప్రాణాలు విడిచానంటే నాజీవానికి యేడుస్తూ ముండవై పోవలసి ఉంటుంది. అయ్యయ్యో! [మూర్ఛిల్లి కొంతసేపటికిఁ దెలివిఁదెచ్చు కొని గంతులువేయుచు చప్పట్లు కొట్టుకొనుచు]

ఏకవీరకు నాకు కళ్యాణమే
మాకిద్దరికి నేఁడే వైభోగమే.

అదుగో ఆకాశం. ఆకాశంమీద పక్షులు పరుగెత్తుచున్నవి. అవ్వేమిటో పాడుతున్నవే. ఓహో! తెలిసింది. తెలిసింది. ఈపక్షులు నాపెళ్లికి పాటలు నేర్చుకుంటున్నట్టుంది. ఓచిలకల్లారా! మంచిమంగళ హారతులు నేర్చుకోండి. మానాన్న చేత మీకందరికి మంచిమంచి బహూమానాలిప్పిస్తాను. నాపెళ్లిఅన్ని పెళ్ళిళ్ళమో స్తరనుకున్నారేమో. ఎప్పటికి కాదు. (నవ్వుచు) అహ్హహ్హా! హావ్హావ్హా! నాకుడోలువాయించటం చేతవును.(తొడలుకొట్టికొనుచు) ఢాం. ఢాం. ఢాం. ఢాం. నాపెళ్ళికి నేనే డోలుకొట్టు కుంటాను. నాకుసన్నాయి మాత్రం చేతగాదు! [ఒకఆకుగొట్టము నూదుచు] తూ. తూ. తూ, తూ. బలే. బలే. యికభజంత్రీలతో నాకుబనిలేదు. ఇకమంగళహారతులా! అవ్విమాత్రిం యీలోపల నేర్చుకోలేనూ. నేర్చుకోవడమేంది. నేనేపాటలల్లుతాను. పాటలల్లడంగూడావొక కష్టమేనా! నేనుమాత్రం కవినిగానా! రెండు లిల్లాయిపదాలల్ల గలిగితే ప్రతివాఁడు కవేలయిపోతాఁడు ఇదిగో యీపదాలే నాపెళ్లికిట్లాపాడు కుంటాను.

ఏకవీరాదేవికి జయమంగళం
నాగరాజు రాణాకు శుభమంగళం.

[వెఱ్ఱినవ్వుతో] అదిగో! ఏకవీర ఏకవీరా. ఆగు ఆగు. నీప్రియుణ్ణి వదిలిపెట్టి యెక్కడికిపోతావు. నీవెంట నేనూ వస్తున్నాను పద పద.

[నిష్క్రమించును]

3. రంగము: చావడిగది

[ప్రవేశము. ప్రతాపదేవుడు.]

ప్రతా—ఛీ, ఛీ, ఇట్టి తెలివిమాలిన నాగరాజు నాకుపుత్రుఁడై జన్మించుటకు మున్ను నేనేమి పాపములొనర్చితినో పానకములోని పుడకవలె నాప్రయత్నములకెల్ల నీత డడ్డుపడుచున్నవాఁడు. ఏకవీరను వశపఱచుకొనుమని బోధించిన నాబోధనలన్నియు బుగ్గిపాలుగావించి వచ్చినాఁడు. నాకేయొక చతురతగల కుమారుఁడున్నయెడల నీపాటి కాయేకవీరనాతనికంటగట్టి వానినాంధ్రరాష్ట్ర సింహాసనాసీనునిఁ జేయకుందునా? ఈశనిగ్రహము నావ్యూహములకెల్ల భంగమొనర్చుచున్నది. కానిమ్ము. ఈపాటిభంగపాటులకే యధైర్యపడుట నాబోటి కార్యసాధకులకు లక్షణము కాదు. ఒకవిషయమునుగూర్చి యెన్నెన్నియోప్రయత్నము లొనర్చుచుందుము. అందన్నియు ఫలించునా? "యత్నేకృతే యదినసిధ్యతి కోఽత్రదోషః" అన్నట్లు లేదేనొక్క ప్రయత్నము సిద్ధింపనియెడల నందు దోషమేమున్నది. పోనిమ్ము. గతజలసేతుబంధనం బేటికి కర్తవ్యమాలోచించెదను. (ఆలోచించి బాగు బాగు. ఏకవీర నంతమందించుటయే కర్తవ్యము. ఏకవీర మరణించిన నిక కుమారసింహుఁడుగూడ నంతమందఁగలఁడు. ఇప్పుడైన నేమి మించిపోయినది? నాకోర్కె నెఱవేఱుననుటలో సందేహము లేదు. ఇంతకుముందే నాకీయాలోచన తోఁచి యుండెనేని యీపాటి కాపని పూర్తి యయ్యెడిది గదా! కాని, అయ్యో! ఏకవీరను, ఆ దివ్యసుందర విగ్రహమును నిష్కారణముగఁ జంప చేతులాడునా? పోనిమ్ము - నేనామెను బెండ్లి యాడినందప్పేమి? నా కిప్పుడఱువది సంవత్సరములకు మించిన యీడు లేదుగదా! ఈ కాలమున నాకన్న నీడుముదిరిన వారెందఱు వివాహమాడుటలేదు! దానికేమి? కాటికిఁగాలుఁ జాచిన వానికిఁగూడ వివాహేచ్ఛగలదు. ఏకవీర నన్ను వివాహమాడుట కంగీకరించునా? అంగీకరింపనిచో నామెకు విషప్రయోగముననో ఖడ్గప్రయోగముననో చావు ముమ్మాటికి నిశ్చయము. (అదాటున నేదియో స్ఫురించి నట్లభిన

యుంచి) వాహ్వా! ఇప్పుడుమఱియొకయాలోచన స్ఫురణకువచ్చినది. ఇంతకును నాకుముందు శుభదినము లుండుటచేత నేయిట్టియాలోచనలప్రయత్నలపూర్వకముగఁ దమంతఁదామే పుట్టుకొని వచ్చుచున్నవి. తీర్థయాత్రయందున్న దేవినిఁ బట్టుకొనుట కడు సులభముగదా. కుమారసింహుఁడుమాత్ర మామెతో పట్టుపడుననుటలో నేమి సందేహమున్నది. అదృష్టవశమునఁ ద్రిపురాంతకుఁడుగూడ నటనుండెనా చెప్పెడిదేమున్నది? కాగలపనిని గంధర్వులే చేసిరన్నట్లు ప్రయాస లేకయే సమస్తమును జక్కఁబడును.

ఓసీ! రుద్రమ్మా! ఈయాత్ర నిన్నంతరింపఁ జేయుటకే దాపురించినది. సందేహము లేదు. ఒకవైపునుండి పాండ్యసైనికులును మఱియొకప్రక్కనుండి జైనభటాగ్రేసరులును పైనఁబడిన నింకెక్కడికి తప్పించుకొని పోఁగలవో చూచెదను. వఱల నీకుమార్తెలతో సురక్షితముగ నేకశిలానగరమునఁ బ్రవేశింతువనుట కల్ల. (త్వరపడుచు) ఇదే సత్వరముగ పాండ్యరాజునకును జైనాశ్రమమునకును నాయుపాయమును దెలియఁబఱచుచు జాబులువ్రాసెదను. (జాబునువ్రాసి వ్రాతబల్లపైనుంచి) ఓహో! యింకను ప్రొద్దున్నది. ముందుజైనాచార్యునకే జాబును బంపెదను. ప్రొద్దుగ్రుంకులోపల బిజ్జలుఁడు వడివడిగపోయి జైనాచార్యుని కీరహస్యమును దెలుపగలఁడు. బిజ్జలుఁడు వీధియరుగుపైఁ బరుండియున్నాఁడు. పిలిచివచ్చెదను. బిజ్జలా! (అనిబిగ్గఱగఁ గేకవైచుచు)

(నిష్క్రమించును)

నాగరాజు—(ప్రవేశించి ప్రతాపదేవుఁడు బల్లపైనుంచి పోయినజాబును గైకొని) ఇదుగో! మానాన్నగారు యేకవీరకు జాబువ్రాసిపెట్టాఁడు. ఏమేమి సంగతులు వ్రాశాఁడో నెమ్మదిగా చూసిచదవాలె. (పిచ్చిపాటలుపాడుచు జాబుఁదీసికొని వెళ్ళును.)

ప్రతాప—(బిజ్జలునితోవచ్చి తానువ్రాసియుంచిన జాబును గానక నిశ్చేష్టితుఁడై) అయ్యో! అయ్యో! నాకొంపమునిగినది. నేనిటనుంచిపోయిన జాబేమైనది? ఇంతలో నిచటికెవ్వరువచ్చిరి. బిజ్జలాచూడుము, చూడుమచట నెవ్వరైన నున్నారేమో?

బిజ్జ—(లోనికేగివచ్చి) స్వామీ! ఈపనిఁజేసినవారు మననాగరాజుగారే. వీధిలో నిలఁబడియున్నాఁడు. వానిచేతులో జాబున్నది. పట్టుకొందమురండు.

ప్రతాప—వీధిలోనికేగిన రహస్యమెల్ల బయల్పడును. కావున బలవంతమునకైన నీవాతని నిటకుఁ గొనితెమ్ము.

బిజ్జ—చిత్తము (లోనికేగి నాగరాజునుబట్టి తెచ్చును.)

ప్రతాప—నాయనా! నాగరాజా! ఏదీ! ఆజాబు నిటుదెమ్ము. తండ్రీ! నీకుఁ గావలసినవానినెల్ల నిచ్చెదను.

నాగ—(వెఱ్ఱిచూపులతో) ఏకవీరయేది? యెక్కడుంది? వస్తుందా? నిజమేన? నాకేకవీర నిస్తావా?

ప్రతా—నీ యేకవీరను నీకు తెచ్చి యిచ్చెదను. జాబునిమ్ము.

నాగ—(జాబును లోలోనఁ జదువుచు) అమ్మో! నాన్నో! రుద్రమ్మనే! రుద్రమ్మనే! చంపేస్తావా? ఏకవీరనో? ఏకవీరనో! ఏకవీరా! నన్ను పెండ్లి చేసుకుంటావా లేదా? మోసంచేస్తావుగా! చూచుకో మానాన్న చేత యేంచేయిస్తానో. చూశావా? రుద్రమ్మనే మింగేస్తాడట. నీవులెఖ్ఖ? నామాటవిను. రా, రా. ముద్దియ్యి! ఇస్తావా లేదా! నాన్నా? చూడవే. మోసంచేస్తుంది. దీనిని చంపేస్తావా?

ప్రతా—కుమారా! నీకుమోసమొనర్చెడియేకవీరను జంపెదనులెమ్ము. నాబంగారు కొండా! నామాటవిని యాజాబుతో నీ కేమిపని? దానినిటఁ బాఱవేయుము. ఏకవీరను చంపెదను.

నాగ—(జాబును బాఱవైచి) ఏకవీరా! నీపని చూచుకోయిక. మానాన్న నిన్నుచంపేస్తాఁడఁట. నామాటవింటావా లేదా! ఇదిగో కత్తి కాచుకో (లోపలి కుఱుకును)

ప్రతాప—బిజ్జలా! సాయంసమయమగుచున్నది. వడివడిగనేగి జైనాచార్యుల వారి కీయుత్తరము నందింపుము. పాండ్యరాజునకుఁగూడ జాబువ్రాసి పంపుచున్నాఁడనని తెల్పి జైనభటులను వెంటనే మొగిలిచెర్లకుఁ బయన మొనర్పుమని నామాటగాఁ జెప్పుము.

బిజ్జ—చిత్తము. దేవా! సత్వరమె పోయెదను.

(ఇరువురును నిష్క్రమింతురు)

4 రంగము. జైనాశ్రమము.

(జైనాచార్య త్రిపురాంతక దేవు లాసీనులై యుందురు)

త్రిపు—(తనలో) ఎట్టకేలకు పాండ్యరాజు దత్తతయగు నాహవమల్లును జంపి యాతఁడు జైనాచార్యుని కడకుఁ దెచ్చుచున్న యుత్తరము నాధారముగఁ జేసికొని బ్రహ్మాదుల కెఱుంగరాని యీ జైనాశ్రమమున బ్రవేశింపఁ గలిగితిని. ఆహవమల్లుఁ డనునామధేయముతో నే నిపు డతిజాగరూకతతోఁ బ్రవర్తించి యిచటి మర్మములనెల్ల గుర్తెఱింగెదనుగాక.

జైనా—(ఆహవమల్లుని వేషముననున్న త్రిపురాంతకుఁడిచ్చిన జాబును బఠించుచు) వత్సా! ఆహవమల్లా! ఈజాబునుబట్టిచూడ మనకార్యక్రమమున కన్నియు శుభసూచకములే పొడకట్టుచున్నవి. చోళరాజులును, దేవగిరి ప్రభువులును సాయపడ సంసిద్ధులైనారఁట. దేవికి గృహశత్రువులుండుట గూడ మనకనుకూలమే!

త్రిపు—దేవి కొలువుకూటమునఁ బనిసేయుచు మనతో నుత్తర ప్రత్యుత్తరముల జరుపుచుండెడువా రెవ్వరో! వారిప్రయత్నములు మన రహస్యములు గుర్తెఱింగి దేవికిఁ దెలియపఱచుటకుఁ గాదుగద!

జైనా—అట్లెన్నటికినిగాదు. ప్రతాపదేవుఁడుఁ డంతటి మిత్రద్రోహి యనుకొంటివా? అట్లయినచో నాతఁ డచటి రహస్యముల నాకేల దెలుపుచుండును! అంతసంశయమేటికి? నేఁ డాతఁడు వ్రాసినజాబిదిగో! చూడుము. దేవి తీర్థయాత్రకై బయలుదేరినదఁట. (జాబు నందించును.)

త్రిపు— (తనలో) సెబాస్. ఒక్కొక్కవిషయమిట్లు బయల్పడఁ జేయవలెను. (జైనాచార్యుఁ డిచ్చిన జాబు నామూలాగ్రముగఁ జదువుకొని) దేవా! ప్రతాపదేవుఁ డిచ్చినసలహా చాలబాగున్నది. దేవిని, గుమారసింహునిఁ బట్టుకొనుట కిది మంచితరుణ మనుట నిజమే కదా! అందుకొఱకై మన సైనికులఁ గొందఱ నటఁ కేలఁబంపరాదు?

జైనా—నేను నదియే యాలోచించుచున్నాఁడను. ఎట్టి యల్పావకాశమునైనను బోగొట్టుకొనినచో మఱల నట్టిది దొరకఁబోదుగదా

నిష్కారణముగ జైనమతవిధ్వంసమొనర్చి మన్ముట్టి యిక్కట్టుల పా లొనర్చిన యాదుర్మార్గుఁడగు గణపతిదేవుని వంశమును నిర్మూల మొనర్పఁ బ్రతినబూనినదాది నేనిట్టి యవకాశముల కెదురుచూచు చు నేయున్నాఁడను.

మ॥ ఖలుఁడై జైనులఁ గండకావరమునన్ • ఖండించి దేవాలయం
బులనెల్లం బడఁగొట్టి వారిగృహముల్ • భూమిస్థలింగూల్చి వి
హ్వలులంజేసినయట్టి క్రూరు గణప • త్యాభిఖ్యవంశంబు నే
న, లయంబందఁగఁ జేతు లేనియెడ జై•నాచార్యుఁడం గానిఁకన్॥

తే॥గీ॥ ధరణిఁ గాకతివంశకాం • తారమెల్ల
మత్ప్రతాపాగ్ని శిఖలచే • మండుదాఁక
ఆంధ్రసామ్రాజ్యమది వశంబైనదాఁకఁ
గన్నుమూయంగఁబో నిది • కల్లగాదు!

త్రిపు—(తనలో) అన్నియు నట్లు వెడలఁగక్కుము. (ప్రకాశముగ) ఆర్యా! పూర్వము నందవంశమునకుఁ జాణక్యునివలె నేఁడు మీరు కాకతీయవంశ నిర్మూలమునకై పుట్టియున్నారనుట సత్యము. మీ కోరిక తప్పక నెఱవేఱఁగలదు.

జైనా—ఈపాటికే నెఱవేఱియుండును. ఎవ్వఁడో త్రిపురాంతకదేవుఁ డఁట. నాప్రయత్నములకెల్ల సైంధవునివలె నాతఁ డడ్డుపడిభంగంబు నొనర్చుచున్నవాఁడు. ఎంతమంది గూఢచారులనుబెట్టి వెతకించినను వాఁడు పట్టువడకున్నాఁడు.

త్రిపు—ఔనుస్వామీ! ఆత్రిపురాంతకుఁ డెవ్వఁడో. కడుమాయావివలె నున్నాఁడు. మాపాండ్యసైనికు లాతనినిగూర్చి పలువిధములగు వింత కథలను జెప్పుకొనుచుందురు. ఆతనినిబట్టి బంధింపవలయుననియే నే నునుగట్టి ప్రయత్నముల సల్పుచున్నాఁడను. త్రిపురాంతకునిఁగూర్చి మీకుఁ దెలిసిన విషయములేవో తెలిపితిరేని నేనాతని నెట్లులైన పట్టితెచ్చెదను. అతఁడు పట్టువడనిది మనకార్యక్రమము సక్రమముగ నెఱవేఱునని తోఁచుట లేదు.

జైనా—అబ్బాయీ! మనకతఁడు శత్రుపక్షములోని వాఁడైననేమి? నిజమునకాతఁడు చాల చాకచక్యము గలవాఁడుసుమా! వాఁడుగడియకొకమాఱు వేషమును ధరించి సంచరించుచుండునట.

త్రిపు—ఓహో! అందుచేతనే గాఁబోలు నాతనిని గుఱుతు పట్టుటకు వీలులేకున్నది. ఎట్టులైనను.

ఆ॥ వె॥ తీవ్రవక్రుషినొనర్చి • త్రిపురాంతకునిఁబట్టఁ
గలమయేని దైవ • ఘటనఁజేసి
మనము విజయకాంక్ష • మనసున నిడవచ్చు
నంతదనుఁకవట్టి • యాసలేల?

జైనా—ఆమాట నిశ్చయము. ఇపుడు మనకు మంచియదను దొరికినదికదా! తీర్థయాత్రకై వెడలిన దేవిఁతోఁగూడఁ గుమారసింహుఁడేగాక త్రిపురాంతకుఁడును బోయి యుండును. వీరి ముప్పురిని పట్టుకొనుటకై యిపుడు మనము త్వరపడవలయును. ఇదేనీకొక జాబునువ్రాసియిచ్చెదను. సత్వరముగఁ బాండ్యరాజు కడకేగి యాతనికిపరిస్థితులనెల్లఁ దెలిపి దగిన సైన్యమును వెంటనే మొగిలిచెర్లకుఁబంపునట్లు చేయుము. (జాబును వ్రాయుచుండును)

త్రిపు—(తనలో) ఔరా! ఈజైనాచార్యుఁడెంతటి తంత్రజ్ఞుఁడు! యెట్టియల్పావకాశమును బోఁగొట్టుకొనఁడట. ఇటనుండి జైనభటులునుఅటుమధురనుండి పాండ్యసైనికులును మొగిలిచెర్లలో నేకవీరాంబనుగొల్చుచున్న దేవిపైఁ బడనున్నారు. నేనికవిలంబముఁ చేయరాదు.ఈజాబునుకొని దీనిని నారహాస్య కుటీరమునఁ బదిల పరచి ముందుమొగిలిచెర్లకేగి దేవి నాపదనుండి రక్షించెదను. పిమ్మట నీజాబునుపాండ్యరాజుకడకుఁగొని యొకవిచిత్ర నాటకము నాడెదను.

జైనా—[జాబును పూర్తిచేసి] వత్సా! ఇదిగో! ఈజాబును కడుజాగరూకతతోఁ గొంపోయి మాపాండ్యరాజునకుఁ జేర్పుము. అతడునుప్రతాపదేవుని జాబుఁజూచుకొని యీపాటికే ప్రయాణ సన్నాహములోనుండియుండును. నీవును సత్వరమేగి మనభటులెల్లరును మొగిలిచెర్లలో నేకవీరాలయముకడ సమావేశము కావలసినదని చెప్పుము.

(జాబునిచ్చును.)

త్రిపు—(తనలో) జైనాచార్యహతకా! నీచే కాకతీయవంశనిర్మూలన మగుటకల్ల. ఈత్రిపురాంతకుని చేతమాత్రము నీజైనాశ్రమవినాశము గావింపబడుననుట ముమ్మాటికిని నిశ్చయము. ఓరీ! ప్రతాప దేవా! తిని యింటివాసముల లెక్కపెట్టిన సామ్యముగఁ జేయుచుంటివా? దేవి రహస్యములనెల్ల నెల్లు బయల్పరచుచుంటివి? కానిమ్ము. నీవనిఁ బట్టెద. [ప్రకాశముగ] ఆర్యా! నేనిదే త్వదాజ్ఞను నిర్వర్తించెదను. సెలవిండు [నమస్కరించును]

జైనా—కుమారా! నీకుదిగ్విజయమగుఁగాక. పోయిరమ్ము.

త్రిపు—[తనలో] తథాస్తు. భగవత్కటాక్షమున నట్టులే యగును గాక.

(నిష్క్రమించును.)

జైనా—ఆహా! ఇంక నేమి కావలయును. ఈయావహామల్లుఁ డెవ్వఁడో బహుమేధావి యని యీతని మాటలవలన నే డెలియవచ్చుచున్నది, ఈతడరిగి సమస్తమును జక్కఁజేయగలఁడు. అదృష్టవశమున రుద్రాంబ పట్టువడెనేని యాంధ్రసామ్రాజ్య మఱచేతిలోని దగునుగదా! ఇంకఁ గావలసిన దేమున్నది! ఇదేపోయి నాభటులను గూడ పయనము చేసెదను. (నిష్క్రమించును.)

—* గద్య *—

ఇది శ్రీ మద్రమారమణ కరుణావిశేషసంలబ్ధ కవితాధురీణ
శ్రీమాన్ ధూపాటి కొండమాచార్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్ర విజయాంబునం
ద్వితీయాంకము.
ఓమ్.





ఓమ్.

# ఆంధ్రవిజయము.

## తృతీయాంకము

### 1 రంగము. ఏకవీరాలయము.

(అర్చకుఁడు పూజావిధానమును ముగించి కర్పూరహారతినిబట్టి నిలిచి యుండ రుద్రాంబ, ఉమ్మక్క, రుయ్యామ్మ కుమారసింహులు చేమోడ్పుతో)

అనుబంధము. 6

రుద్రాంబ—(నిమీలితలోచనయై) ఓ జగజ్జననీ! కాత్యాయనీ!

మ॥ జననీ! నాసుత గర్భముందాక మహా • శౌర్యాన్వితుండైన సూ
నునిఁ గల్గించియు నాంధ్రరాజ్యరమన • న్యుల్ బాధలన్వొట్టకుం
డను గాపాడఁగ వేడుచుంటి దయతో • డన్నామొఱాలించిపా
వని! నన్నీవు కృతార్థఁజేయు జగదం • బా! ఏకవీరాంబరో॥

నాపుత్రికలకుఁబుత్రసంతాన భాగ్యమొసంగి కటాక్షశ్రీల రక్షింపుముతల్లీ!

ఉమ్మక్క—(అంజలిఁబట్టి)

గీ॥ ఏమహాతల్లి నామంబు • హృదయమందు
నెంచినంతనె పాపంబు • లెల్లఁదలఁగు
నట్టి కరుణాస్వరూపిణి • కాత్మకుసుమ
మర్పణముసేతు నేకవీ • రాంబకిదిగో॥

రుయ్యమ్మ—(ముకుళితకరకమలయై)

గీ॥ జగమునంగల్గు జీవసం • చయములెల్ల
నెవరికృపచేతనెపుడు వ • ర్ధిల్లునట్టి
యఖిలదురిత నివారిణీ! • ఆదిశక్తి!
ఏకవీరాంబ వందనం • బిదిగో గొనుము॥

కుమార—(చేతులుజోడించి) అంబా! సకలమనోభీష్టముల సమకూర్ప సంసిద్ధవైయున్న నిన్నేమని వినుతింపవలయునో తెలియకున్నది. అయినను నా యీవచ్చియురానట్టి పలుకులనాలకింపుము.

చ॥ సకలచరాచరంబులును • సంతతమేరి విచిత్రనైపుణిన్
ప్రకటమొనర్చుచుండె జగతి • వర్ధిలుచుండునో యేరిశక్తి యం
దొకయరవీసమేనియును • నూహయొనర్పఁగలేరొ మానులా
వికచపయోరుహాక్షి కివె • వేయినమస్కృతులాదిశక్తికిన్॥

ఉమ్మక్క—కుమారసింహా! మనోభీష్టమును నెఱవేర్పుమని యేకవీరను ప్రార్థించుట ముగిసినదా!

రుయ్యమ్మ—అక్కా! క్రొత్తగానడిగెదవేల? మనోరథసిద్ధికై కుమారసింహుఁడేకవీరనాశ్రయించి చాలకాలమైనది.

కుమార—(మందహాసముతో) వదినలారా! పరిహాసములేటికి? ఈమహాతల్లి కరుణయున్నచో మీరుచూచినవ్వేడు నాపచేనెపంతును.

రుద్రాం—కుమారా! పుత్రికకలారా! ఆవైపునకుఁగూడ వెళ్లివత్తము రండు.

(రుద్రాంబ లోనికేగును. మిగతవారు కొంతవరకునడచి యాగుదురు)

(తెరలో శత్రువులకలకలము)

ఆపద, ఆపద. కుమారసింహా! కుమారసింహా! నిరాయుధనై యున్న నన్ను శాత్రవు లీడ్చుకొని పోవుచున్నారు. త్వరపడుము.

ఉమ్మక్క, రుయ్యమ్మ—అయ్యయ్యో!తల్లీ! నీకెట్టి యిక్కట్టు తటస్థమయ్యెను. ఇపుడేమిదిక్కు. అయ్యో! కుమారసింహా! ఇంకెక్కడి రుద్రాంబ! శత్రువులీడ్చుకొనిపోవుచున్నారు.

కుమార—(వారించి) వదినలారా! భయముడుగుడు. ఈక్రూరాత్ముల రక్తధారలచే నేకవీరాదేవికి సంతసంబొడగూర్చెద. సెలవిండు

ఆ. వె. ఇదెమదీయ నిశిత • హేతిచే దురితాత్ము
లైనవైరులఁగూల్చి • యాహవమున
దేవిముప్పుఁబాపి • తెచ్చియిచ్చెదమీకు
నాజ్ఞయిందునాకు • నతివలార!

మీరుమాత్రమిచట జాగరూకతతో నుండవలయునుసుమా!

రుయ్యా—కుమారా! నీ సంశయమునాకుఁదెలియును. అబలలమని సందేహింపఁబనిలేదు. ఆంధ్రసామ్రాజ్యమునఁబుట్టిన వనితలు పాపకార్యములకుఁదక్క వేఱొండెద్దానికిని భయపడరని తెలిసియు సంశయిఁచెదేల? గర్భిణియగు నక్కగారి క్షేమమును నేనారయుచుందును, నీవు దేవిసంరక్షణ ప్రయత్న మాచరింపుము.

(తెరలో)

ఇంకెక్కడి రుద్రాంబ! త్వరపడుము. త్వరపడుము.

కుమార— (క్రోధరక్తలోచనుఁడై) ఓరోరి! మాతృదేశద్రోహచింతనాసక్తులారా! చచ్చితిరి! కాచుకొనుఁడు, (కరవాలముదిప్పుచు) పిఱికిపందలారా! ఎవరురామీరు?

శా॥ ఓరోరీ! కలుషాత్ములార! తగునే? • యోధాగ్రణుల్గారె మీ
బీరం బాలమునందుఁ జూపఁదగు; త • స్త్రీరత్నముంబట్టగా
నేరా! యెట్లుతలంచినారలిసి ఘో • రాసిన్ మిముంగూల్చి భూ
భారంబుం దలఁగింతు నీక్షణమె నా • పల్కుల్మది న్నమ్ముఁడీ!॥

అనుబంధము. 7 (నిష్క్రమించును)

రుయ్యమ్మ—అక్కా! విశ్రాంతిగ నీవిటఁగూరుచుండుము. గర్భవతివై యున్న దానవు. నీమనోభావమతినిర్మలముగా నుండవలయును. భయపడనేల? కుమారసింహుఁడండయైయుండ నాపదలు దాపునకు రాఁజాలవు.

ఉమ్మక్క—అమ్మాయీ! ఆపదలయందే ధైర్యమును బూనవలయుననుట యీనాటిమాటకాదుగదా. నేనెక్కువకాలము నిలువఁబడియుండఁజాలను. నీవు చెప్పిన చొప్పున నిచ్చటఁ గూరుచుండెదను. పోరు సమీపముననే జరుగుచున్నది గాన విశేషములఁ గనిపెట్టి చెప్పుచుండుము. వినుచుండెదను. (కూరుచుండును)

(తెరలోఁ గుమారసింహుఁడు)

అత్తా! రుద్రాంబా! మఱేమియుభయము లేదు. నీపాదసేవకుఁడు కుమారుఁడిదే వచ్చినాఁడు. కంఠమునఁ బ్రాణమున్నంత వఱకీతఁడు నీకెట్టి యాపదయుఁ గలుగనీయఁడు. ఓహోరీ! దురహంకారులారా!

ఉ. చెచ్చెర రుద్రమాంబ నిటఁ • జేర్చి క్షమింపఁగ వేడి మీద మీ
యిచ్చఁ జరింపుఁ డంతియె సుఁ • డీ విననౌనటుగాక యున్న నిం
కెచ్చటి కేగఁ జూచెద రి ॥ దే చనుదెంచెఁ గుమారసింహుఁ డిం
కెచ్చటి యాస ప్రాణము లి • కేగతిఁ గంఠములందు నిల్వనౌ!

ఉమ్మక్క—అమ్మాయీ! చూడుము. మన కుమారసింహుఁడు రంగమునఁ బ్రవేశించి నట్లున్నాఁడు.

రుయ్యమ్మ—సెబాస్! ముద్దుల మఱఁదీ! ప్రపంచమున నీకీడు వచ్చువారు గలరా! అక్కా! చూడుము. మన కుమారసింహుఁడు తల్లి రెండుచేతులను విఱచి కట్టి పట్టుకొనియున్న జైన విగ్రహమును క్షణమాత్రములో రెండుతునియలుగ నఱికివైచి వానిచేతి కరవాలమును దేవికందించినాఁడు.

ఉమ్మక్క—ఏకవీరాంబకటాక్షమున నీయాపదనుండి గట్టెక్కఁగలమను టకిదియె ప్రథమ శుభసూచకము.

రుయ్య—భయములేదు! తల్లి ఖడ్గపాణియైనది. చుట్టుపట్లఁగల జనము లెల్లరును దొరకిన సాధనములతో నామెకు సాయపడుచున్నారు. అబ్బబ్బా! ఎన్నెన్ని ప్రాణములు కడతేరుచున్నవి!

(తెరలో)

మురారిదేవా! హరిహరదేవా! ఏమిగతి!

ఉమ్మక్క—అమ్మాయీ! ఎవ్వరట్లు దీనముగఁ బలుకువారు?

రుయ్యమ్మ—మనకుమారసింహుని ధాటి కోర్వఁజాలక గతశేషమగు రిపుసేన నానాదిక్కులఁ జెదరి నాయకులగు మురారిదేవ హరిహర దేవులఁ గేకలు వేయసాగె.

ఉమ్మక్క—(ఆతురమున) అమ్మాయీ! యిటేదియో శబ్దము వినవచ్చుచున్నది. చూడుము. శత్రువులెవరైన మనమిట నొంటరిగ నున్న సంగతి నెఱింగి మనలఁ బట్టుకొనుతలంపున వడివడిగ వచ్చుచున్నారా?

రుయ్య—(సంభ్రమమున) ఓహో! ఈయాపద నెట్లు గడువ వలయును? ఎవ్వఁడో ఆజానుబాహుఁడగు పూరుషుఁడొకఁడిటకు వచ్చుచున్నవాఁడు. రానిమ్ము. (బొడ్డునయున్న చంద్రాయుధమును బెఱికి) ఓరీ! నరాధమా! ఎవ్వఁడవురా నీవు?

గీ. ఒంటిమై యిర్వురము స్త్రీల • ముందు బెఱికి
నీకెఁ బట్టెదనని చిత్త • వీథిఁ దలఁచి
క్రొవ్వి వచ్చెదవే? రమ్ము • కూళ! యిపుడె
ధ్వంస మొనరింతు చంద్రాయు • ధమున నిన్ను!

సోమదేవుఁడు—(ప్రవేశించి) తల్లీ! నేను దేవి కాప్తవర్గములోని వాఁడను. పరుఁడనని తలంచి దూరకుము.

ఉ. ఏను రిపుండనంచు మది • నెంచకుమమ్మ! ధరిత్రిలోన నా
మేనసు ప్రాణముల్ గలుగ • మీకశుభంబు లొనర్ప నెంతవాఁ
డైనఁ దలంపఁ బోఁడు భవ • దంబకు నాపుఁడ మీదు సేమముం
మానసవీథిఁ గోరి యిటు • మానిని! వచ్చితి నమ్మ చెచ్చెరన్॥

ఆ. వె. శాత్రవులను జంప • సమకట్టు వేళల
హస్తమునను బట్టు • నాయుధమును
ఆప్తవరులఁ బిలచి • యాదరించెడు వేళఁ
జూప నర్హమగునె • సుదతి! చెపుమ!

రుయ్య—కీడుసేయదలంచి వచ్చెడు శాత్రవునిగ నెంచి దుర్భాషలాడితిని. మిత్రుండవేయైన క్షమింప వేడుచున్నదానను.

ఉమ్మక్క—మిత్రవర్యా! నీనామమెద్ది? నీవు దేవి కాప్తవర్గములోని వాఁడ వెట్లైతివో మేమెఱుంగవచ్చునా?

సోమ—అమ్మాయీ! నాపేరు సోమదేవుఁడు నాయుదంతంబంతయుఁ జెప్పుటకిది సమయముకాదు.

(తెరలో)

దేవీ! నాపని ముగియుచున్నది! నీవు మాత్రము జాగ్రత!)

రుయ్య—(ఆతురమున) అయ్యో! కుమారసింహుని పని కావచ్చినదఁట. ఇఁకెట్లు?

(తెరలో)

మురారిదేవా! మంచిపనిఁ జేసితివి. నాకొఱకై నీవు వేచి యుండకుము. మూర్ఛితుఁడయిన కుమారసింహునిబంధించి కొంపోవుచుండుము. నేనిదే దేవిని ప్రాణములతోఁబట్టి ప్రభునకప్పగించెదను. పదపద.

సోమ—అమ్మలారా! వింటిరా? కార్యము మించిపోవుచున్నది. ఇదే పోయి దేవిని శత్రువులబారినుండి తప్పించి తెచ్చెద. సెలవిండు. (బిగ్గఱగా) ఓరీ! ఉన్మత్త ప్రలాపములతో నేమిపని!

శా॥ ఓరీ! నోటికి వచ్చినట్టులుగ నే • దో! వాగినం జెల్లునే
క్రూరాత్మా! భవదీయ పౌరుషము నా • కుంజూపఁగా రమ్ము నీ
శిరంబుంగని సంతసించెద నెదన్ • వీరాగ్ర గణ్యుండ నం
చీరీతిన్ బలహీనఁ బట్టఁదగునే • హీనంబుగాఁ దోచదే॥

ఆ॥ వె॥ క్రూళ! దేవిఁబట్టి • గొంపోదు ననుమాట
మానసంబునందు • మఱచిపొమ్ము!
పిడుగువోలెఁ దలను • బడెడు ఖడ్గపుదెబ్బ
తప్పిపోవు త్రోవఁ • దలఁచు కొనుము,

(కరవాలమును ద్రిప్పుచు రభసమున లోని కేగుచు)

ఉమ్మక్క—అమ్మాయీ! యీతఁడెవ్వఁడో నీకుఁ దెలియునా?

రుయ్యా—అక్కా! చూడుము. ఈతఁడెవ్వఁడైన నేమి? ఇట్టి యాపద్బాంధవుండు లభించుట మనయదృష్టముననే సుమా. బలే! సోమదేవా! మాకుమారసింహునంతటి వాఁడవే నీవు! ఆహా! వీరపురుషోచితముగఁ జెప్పినట్టులఁ జేసితీరితివి.

ఉమ్మక్క—ఆతఁడిప్పుడేమి చేసెను.

రుయ్యా— ఏమిచేసెనా! అక్కా! తల్లినిఁ బట్ట యత్నించుచున్న దురాత్ముని దన నిశిత కరవాలమునఁ దుత్తునియలొనరించినాఁడు. శత్రుసైన్యము లధిపతి హతమగు టెఱింగి పాఱిపోఁదొడంగినవి. అయ్యో! సోమదేవుఁడంతటితోఁ దృప్తినందక పలాయితులగు రిపులవెంట నంటి తరుముచున్నవాఁడు. ఇదియేమి? దేవి నలుదిక్కులఁ జూచుచు నిశ్చేష్టయై నిలువఁబడిన దేలనో తోఁచకున్నది!

ఉమ్మక్క— మన కుమారసింహుఁడేమి చేయుచున్నాఁడో చూడుము.

రుయ్య—ఓహో! ఆతని కొఱకే కాఁబోలు తల్లిగారట్లు చూచుచున్నది! కుమారసింహుఁడు నాకంటికగపడుటలేదు. ఒకవేళ సోమదేవునితోఁగూడ శత్రుసంహారమును జేయుచు చాలదూర మరిగియుండనోపు. అదిగో! తల్లిగారిటకే వచ్చుచున్నది. సమస్తము నామెవలనఁ దెలిసికొందము. (రుద్ర స్వరూపిణియై రుద్రాంబ ప్రవేశించును)

రుద్రాం— బిడ్డలారా! మీకు సేమమా! ఆహా! ఎవ్వరెన్ని విధముల నివారించినను పట్టినపట్టు విడువక పయనమై వచ్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనదిగదా!

ఉమ్మక్క—అమ్మా! భగవత్కృపా విశేషమున నిప్పటి కెల్లరమును సేమముగ నున్న యట్టుల భావింపవచ్చునా?

రుద్రాం—అమ్మాయీ! అట్లను కొనుట కింకను కుమారసింహుని విషయమేమియుఁ దెలియకున్నది. "దేవీ! నాపని ముగిసినది. నీవు జాగ్రత్త," యనియాతఁడు నాకు హెచ్చరిక యిచ్చినప్పుడే నాకును వానికిని ఋణముతీరినదని భావించియుంటిని. కాని వెంటనే పాప మానూతన పురుషుఁడు వచ్చి తోడుపడెను.

ఉమ్మ—అమ్మా! ఆసోమదేవుఁ డెవ్వఁడే?

రుద్రాం—ఎవ్వఁడో గోచరించుటలేదు గాని యమ్మహాపురుషుఁ డాపద్బాంధవుఁడు సుమా.

రుయ్య—అదుగో! ఆతఁడీటకే వచ్చుచున్నవాఁడు కుమారసింహుని జాడ యాతనికిఁ దెలియునేమో!

సోమ—(ప్రవేశించి) దేవీ! సేవకుని నమస్కారములందుకొని ముందీ నామాటకు జవాబుఁజెప్పుము. కుమారసింహుఁడేడ. భద్రమా!

రుద్రాం—చిరంజీవివై వర్ధిల్లుము తండ్రీ! కుమారసింహుని జాడ తెలియకయే మేమిపు డాందోళనపడుచున్నారము.

సోమ—అయ్యయ్యో! అల్లైనఁద్వరపడుఁడు. శత్రువులుపలాయితులైరి. భయము లేదు, కుమారసింహుని జాడ నరయుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు)

2. రంగము. కావేరీనదీ ప్రాంతకాంతారము.
(ఏకవీర దేవదేవుని వేషమునఁ బ్రవేశించును)

దేవ—(నిమీలితలోచనములతో) అనుబంధము. 8

ఉ॥ అమ్మరో! యెట్టులెట్టులో గృ • హంబును వీడినదాదినాఁకఁ బ్రే
మమ్మున నింతదాఁక పలు • మాఱులు సాయమొనర్చితీవె స
త్యమ్మ! నమస్కృతుల్ శతస • హస్రము లందుకొనంగదమ్మ మా
యమ్మ! యికెట్లు బ్రోచెదొ ద • యామతి నమ్మితి పార్వతీ సతీ!

ఓతల్లీ! నీకృపావిశేషము చేత నే నేఁ డీయతి రహస్యమగు లేఖ నా చేతికిఁ జిక్కినది దీని నాధారముగఁజేసికొని నే నాడఁబోవు నాటకమును నీవెట్లు కొనసాగింతువో!

ఆహా! ప్రతాపదేవుని బారినుండి తప్పించుకొని వచ్చినది మొద లెన్నెన్ని విచిత్రములు జరిగినవి! పురుషవేషధారినగు నన్ను నాసోదరుఁడగు త్రిపురాంతక దేవునిగ భావించి, వెంకన్న నన్నారహస్య కుటీరమునకుం గొంపోవుటయు, తదనుగుణ్యముగ నేనును త్రిపురాంతకుని భంగి నటింప రంగడెఱింగించిన రహస్యములును, పిమ్మట మేమిరువురమును గలిసి యీలేఖయందొనర్చిన మార్పులును మఱింతవింతఁ గొల్పుచున్నయవి.

సహోదరా! త్రిపురాంతకా! స్వదేశమందు నీకుఁగల భక్తియు స్వప్రజాక్షేమము నారయుటయందలి నీ యవ్యాజానురక్తియు దేవిచే కొలఁదికాలముననే గుర్తింపఁబడఁగలవు! ఆహా! ఆమాయావియగు జైనాచార్యుని మర్మ గృహమును నీవెట్లు కనిపెట్టఁ గలిగితివి? అటనుండి పాండ్యరాజునకీ జాబును గ్రహియింపనెట్లు వీలుపడెను! ఏమహాకార్యము కొఱకు నీవీ యుత్తరము నతిభద్రముగ దాచి యుంచితివో ఆమహా కార్యముకొఱకే నేనిపు డీ యుత్తరమును సంగ్రహించితిని. శాంకరీకటాక్ష ప్రభావముచే నాకార్యక్రమము సంపూర్ణముగ నెఱవేఱి నీకమందానందం బొడఁగూర్పఁగలదు లెమ్ము.(దీనముగ) ప్రియా! కుమారసింహా! ఎట్టియాపద ఘటిల్లెను. నీకొఱకే నే నిప్పు డీ వేషమును ధరించి వచ్చుచుంటిని. పురుషవేషమున నుంటచే స్త్రీజన సామాన్యమగు దైన్యము

నభినయింప నాకిప్పు డనువుపడకున్నది. (దిక్కులఁ బరికించి) ఓహో! సంధ్యాకాలమైనదే !

మ॥ సరసస్ఫూర్తి మనోజ్ఞగీతములనే • శ్రావ్యంబులై వీనులన్
జొరుచున్ పక్షులు గూండ్లకేగెడు నటం • చున్ దెల్పె; భానుండుదా
నరుణాంగుండై యపరాద్రిఁ జేరఁజనె సం • ధ్యారాగముల్ దట్టమై
విరియంబారె సువర్ణవర్ణమునఁ గా • వేరీజలంబందవే॥

తెల్లవారుసరికి మధురానగరమున్బ్రవేశించి పాండ్యరాజును దర్శించవలయును. ఇఁక నాలసింపఁజనదు. సత్వరమరిగెదను.

3 రంగము - పాండ్యరాజు కార్యస్థానము.

(జటవర్మ, సుందరపాండ్య మహారాజు పట్టుసోఫాపైఁ గూర్చుండును)

జట—(క్రూరదృష్టితో) ఛీ! ఛీ! ఈ మురారిదేవుని నేమిచేసినను గసి తీరదు. హరిహరదేవునితో నీతఁడును శత్రువులచేత మడసియుండిన మఱింత బాగుండెడిది. ఈ మూర్ఖుఁడు చేఁజిక్కిన యారుద్రమ్మను వదలి పనికిమాలిన యీ కుమారసింహు నేలతెచ్చెను? దేవినే పట్టి తెచ్చినయెడల నాకార్యక్రమ మెంత జయప్రదముగఁ గొనసాగి యుండెడిది! నాకొఱకై తన సర్వస్వమును వినియోగపఱచుచున్న జైనాచార్యుఁ డెంత సంతసిల్లియుండును. అది యటుండ నాఁడు నాకడనుండి జాబునుగొని యేగిన యాహవమల్లుఁ డింతవఱకును దిరిగి రాకుండుటకు హేతువేద్దియో తోచకున్నది.

సేవకుడు—(ప్రవేశించి) దేవా! జైనాచార్యునికడనుండి యొక రాజకుమారుఁడు వచ్చి ద్వారమువద్ద వేచియున్నాఁడు. లోనికి వచ్చుట కాజ్ఞయిత్తురా ?

జట—తక్షణమే తోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తము. (నిష్క్రమించి)

దేవదేవుఁడు—(ప్రవేశించి) ఆర్యా! నమస్కారము. దీనినిఁ జిత్తగింపుఁడు. (జాబు నందించును)

జట—(జాబును లోలోనఁ జదువుకొని) దేవదేవా! నీకు శుభమగుఁ గాక! రమ్ము. కూరుచుండుము. నీవాచార్యులవారి ప్రియశిష్యుఁడ

వనియు, నతి పరాక్రమశాలివనియు నీవిషయములెల్ల నాకీ జాబుమూలముగఁ దెలియవచ్చెను. మీ గురువుగారి యాజ్ఞచొప్పున నిన్న త్యాదరమునఁ జూచుచు నాతో సమానముగ సకలభోగముల ననుభవింపఁజేసెద. నాయొద్దఁ గొంతకాల ముండుట కిష్టపడియెదవా!

దేవ—(వినయముతో) మహాప్రసాదము.

క॥ పరిపోషించెద రమ్మని
కర మనురాగమునఁ బిల్వఁ • గాదనఁగలనే
సిరిరా మోకాలొడ్డెడు
విరసులు భువిఁ గలరటంచు • వింటిరె చెప్పుఁడీ?

తమ యనుగ్రహముకన్న నాకుఁ గావలసినదేమున్నది? రాజకీయ విషయములయం దెల్లవిధముల మీకు నేను తోడుపడఁగలను.

జట—దేవదేవా! నీవినయమునకు మెచ్చితిని. ఆహవమల్లుఁడు నాకడ లేని కొఱంతను నీవు తీర్పఁగలవనుటలో సందియము లేదు. జైన స్వామి వానిని త్రిపురాంతకునిఁ బట్టుకొనుటయందు నియోగించుట శుభప్రదమైన విషయముసుమా! ఎట్లంటివేని,

గీ॥ వైరివీరులలో నికఁ • భయముఁగొల్పు
వాఁడు త్రిపురాంతకుఁడె వేరు • వారు లేరు!
వానిఁ బట్టిన జయము త • ప్పదు నిజంబు
చేతను గుమారసింహుండు • చిక్కెఁ గాన!

దేవ—(తనలో) మనమా! నీప్రియుని యుదంతము తేలినది. భయముడుగుము. (ప్రకాశముగ) ఆ! ఏమి? కుమారసింహుఁడే చిక్కెనా? అది యెట్లు సాధ్యపడెను. ఇంక మనకు విజయమనుటలో సందియమేమున్నది? ఇపు డా కుమారసింహుఁ డెచ్చటనున్నాఁడు?

జట—కుమారసింహుఁడు పట్టువడిన విషయమే మీకుఁ దెలియలేదా? మొగిలిచెర్లలో నేకవీరాలయముకడ జరిగిన పోరులో రుద్రాంబ ప్రాణావశిష్టయై పాఱిపోయినదఁట. కుమారసింహుఁడు మాత్రము మురారిదేవునిచే నిటకుఁ గొనితేఁబడినాఁడు. ఇపు డాతఁడు నా చెఱసాలయందున్నాఁడు. ఆతఁడు చాల పరాక్రమవంతుఁడఁట. దేవి కాతఁడు దక్షిణహస్తమని ప్రతీతికలదు.

దేవ—దేవా! మా జైనస్వామిగూడ నాతని ధైర్యసాహసముల కచ్చెరువందుచుండును. అట్టివాఁడు మనచేతఁ జిక్కినప్పుడు సామోపాయముచే మెల్లగ నాతనిని వశపఱచుకొంటిమేని శత్రురహస్యములెల్ల బయల్పడునుగదా!

జట—దేవదేవా! ఏమి నీబుద్ధికుశలత! ఆతఁడు మనకు వశుఁడైనచో నేకశిలానగరమందలి రహస్యములెల్ల బయల్పడుటయేకాక యుద్ధరంగమున మనవైపునఁజేరి పోరాడఁగలఁడు. కాని యంతటిపని సులభసాధ్యమా! రుద్రాంబయెడ నాతనికిఁగల యభిమానము నెట్లు త్రెంపివేయఁగలము!

దేవ—మీరీపని కధైర్యపడవలసిన యవసరములేదు. నేనీవిషయమున సంతోషముతో శక్తివంచనలేకుండఁ బనిసేయఁగలను. ఇపుడాతఁ డెట్టిస్థితియందున్నాఁడు?

జట—యుద్ధరంగమునఁగలిగిన గాయములచే బాధపడుచున్నాఁడు. రాజవైద్యులు చికిత్సఁజేయుచున్నారు. ఆతనిని వశపఱచుకొను భారమును నీవువహించెదవా?

దేవ—సందేహమెందులకు? మునుముం దాకుమారసింహుని లక్షణముల నెఱుంగవలయును. వానినొకసాఱు చూచివత్తమా?

జట—అట్టులే; యాతనినిఁ జూచివత్తమురమ్ము.

(నిష్క్రమింతురు.)

## 4. రంగము. కారాగృహము.

(కుమారసింహుని బంధించి భటులు ఘారాయిచ్చుచుందురు)

కుమార—(చెఱసాలలోఁ గూరుచుండి)

అనుబంధము 9

సీ॥ ఆంధ్రమాతకు ద్రోహ • మాచరించెడుపాత
కులనెల్ల రణమునఁ • గూల్పనైతి!
ప్రాణంబులైదు నా • పైనిల్పి జీవించు
నేకవీరను గ్రహి • యింపనైతి!

ననుఁజూచుకొని యుద్ధ • మునుజేయఁదలఁచిన
దేవికోరిక నేనిఁ • దీర్పనైతి!
దేశభక్తుండనైన • త్రిపురాంతకునకు నే
సాయంబుగా నుండఁ • జాలనైతి!

గీ॥ మదిని దలచినవన్నియు • మాయమయ్యె.
చోద్యముగ బాహుబలమెల్ల • శూన్యమయ్యె
పరుల చెఱసాలఁ బడుట సం • ప్రాప్తమయ్యె
విధివిధానంబు మఱిమఱి • వింతయయ్యె!

లలాటలిఖిత మెంతటివానికైనఁ దప్పదుకదా! ఇంక నేనెన్ని యిడుములఁ బడవలసియున్నదో! నాభావిచరిత్రయం దెట్టి మార్పులు కలుగ నున్నవో యెట్లెఱుంగనగును? అబ్బా! అన్నిటికన్న మిన్నయై యీవిరహాపరితాపము హృదయనిర్భేదకమగుచున్నది!

ఉ॥ ఎచ్చటఁజూచుచున్న జగ • దేకమనోహరి యేకవీరయే
పచ్చనిపైఁట కొంగునను • బాష్పములద్దుచు వేడియూర్పులన్
బుచ్చుచు నిష్టదేవతకు • మ్రొక్కుచుఁ జాలఁగ నన్నుఁ గూర్చి తా
వచ్చెడిలాగు తోఁచెడిని • భ్రాంతియొ నిక్కమొ యెట్లెఱుంగనా!
మనోహరీ!

ఉ॥ ఓసుకుమారినన్నుఁగన • నోపక నేటికి నొంటినవ్యనిన్
గాసిలె దీవయో! కలుష • కర్ముడనైతి విరించి యీగతిన్
వ్రాసెలలాటమందుననుఁ • బట్టిరి శాత్రవులేమిసేతునా
హా! సఖి! దైవమెన్నఁడు ద • యన్ మన నిర్వురఁ గూర్పనెంచెనో
ఓ పరమేశ్వరా! మహేశ్వరీ మనోనాథా!
గీ॥ బంధుజనులెవ్వరును లేరు • బలము లేదు
నాకునై ప్రాణ సఖియెంత • నవయునొక్కొ
యిల్లుఁజేర్పంగఁ గీలు నూ • హించి వేగ
దేవదేవ! మహాత్మ! యే • తేరవయ్య!

(దేవదేవుఁడు, పాండ్యరాజు, వైద్యుఁడును బ్రవేశింతురు)

దేవ—గీ॥ అన్నివిధములనీకు సా • యంపడంగ
దేవదేవుఁడిదే యరు • దేరినాఁడు
కలుగఁబోదింక నీకప • కారమెదియు
మానుమా యింక శంక కు • మారసింహ!

కుమార—(విస్మయముతోఁ(దనలో) ఎవరువారు! నిజముగ నా మొఱ నాలకించి పరాత్పరుఁడు సాక్షాత్కరించెనా యేమి! మాటలాడుటకు గూడ శక్తిచాలకున్నదే! (ప్రకాశముగ) మహాత్మా! శరీరదార్బల్య ము—మిక్కుటముగానున్నది. ఇంతకు—నేకవీరను—వదలివచ్చుట చేతనే యిట్టియిక్కట్లు రానమకట్టినవి అబ్బా—జ్వరబాధ—వైద్యు లింకనురాలేదు. (తలవాల్చును)

పాండ్య—అయ్యా! వైద్యశిఖామణీ! కుమారసింహుఁడు తమకొఱకై యెదురుచూచుచున్నట్లున్నది. చేయిఁజూచి శరీరస్థితినిఁ దెలుపుఁడు.

వైద్య—చిత్తము రాజా! ఇదిగో చెప్పెదను. (కుమారసింహుని చేయిఁ బట్టుకొని యాలోచించుచుండును)

దేవ—అయ్యా! తమరేదో తీవ్రముగ విచారించుచున్నారే. ఉపద్రవ మేమైనఁగలదా!

వైద్య—అయ్యా! ఇదిచాలా కఠినరోగముగఁ దోఁచుచున్నది. నాడి యందు వాతము ప్రబలముగా నున్నది. కనుక నౌషధమును మార్చి వాతరాక్షసమును బ్రయోగింతమాయని యాలోచించుచున్నాఁడను.

జైలుభటుఁడు—(ముందునకువచ్చి) (తనలో) నాయనా నీదేసొమ్ము. కానీ! ప్రాణంమీదికి వచ్చిందంటేనే గాని డబ్బురాలదులే!

దేవ—అయ్యా! అంతకంటె నన్నివిధములగు జ్వరములకును మంచిదగు మహాతరుణార్కము నిచ్చిన నుత్తమముగదా.

వైద్య—మీరు శెలవిచ్చినదిగూడా మంచిదే. పోనిండు. మీయుద్దేశ్య ప్రకారము తరుణార్కము నేయుపయోగింతము(మందుతీయుచుండును)

జైలుభ—(తనలో) ఇప్పడు వైద్యుడిపనికి చిక్కొచ్చిందే! ఈకొత్తా యినయెవరోగాని కాస్త తెలిసినవాడాలెఉంది. అందుచేతనే వైద్యు

డికి బిక్కమొగంపడి సరే మీయిష్టప్రకారమే చేస్తానని బదులు చెప్పుతున్నాఁడు. కొంపతీసి యీయనిది ప్రారంభవైద్యంకాదుగదా. ఒకరిద్దరిని చంపితేనేగాని వైద్యుఁడుగాఁడంటారు. ఈయన మొదటి ప్రయోగం పాప మీకుమారసింహునిమీద చూపించడుగదా.

జట॥, పాండ్య— దేవదేవా! నీకు వైద్యవిద్యయందుఁగూడ పరిచయము కలదే! అసాధ్యుఁడవు వలెనున్నావు. అదిగో మందుతయారయినది, ఇఁకఁ ద్రావింపవలయును.

వైద్యు—(దేవదేవుని సాయముతో కుమారసింహునిచే మందుద్రావింగించును.)

కుమార—(కన్నులువిప్పి చూచుచు) ఏకవీరా! ఏకవీరా! ఎచ్చట నున్నావు? ఎన్ని మందులు త్రాగి—యేమి ప్రయోజనము. —నీవు—నాకడలేనిచో ఈజ్వరబాధ—తగ్గుటకల్ల—ఏకవీరా! ప్రియా! ఏకవీరా! అబ్బా—(కనులమూసిపరుండును.)

దేవ— రాజశేఖరా! కుమారసింహుని మాటలన్నిటిని వింటిరా! ఈతడెవ్వతెనో యేకవీరయను కన్నియను మోహించియున్నాఁడు. ఇతనికింక మఱెన్ని యౌషధములనిప్పించినను బ్రయోజనము లేదు. తమరంతఃపురమున కరుగుదేరితిరేని కుమారసింహుని ప్రాణరక్షణోపాయము నెఱింగించెదను.

జట— అబ్బాయీ! దేవదేవా!

ఉ॥ ఎన్నివిధమ్ములైన శ్రమ • లేనియు నీవు వచించురీతినే
నన్నిఁటికోర్చిచేతు నుగు • ణాలయ! నీదె భరంబికేల! రా
నున్నరణాంగణంబున మ • హోత్కట బాహుబలంబునన్ జయా
భ్యున్నతిఁగూర్పఁగావలయు • హో! పురికొల్పి కుమారసింహునిన్.
కావున నాలోచింతము రమ్ము,

(అందఱు నిష్క్రమింతురు.)

5 రంగము. సుందరమందిరము.

(పట్టుసోఫాపై పరుండియున్న కుమారసింహుని నేకవీర పరిచర్య సేయుచుండును)

ఏక—(తనలో) ఎట్టకేలకు భగవత్కటాక్షమునఁ బ్రియునిఁజేరఁ గలిగితిని. పాండ్యరాజు నన్నుగట్టిగా నమ్మినాడు. నేనందుల కనుకూలముగఁగడుజాగ్రతతో నటింపవలసియున్నది. "దేవదేవా! ఏకవీరరూపమును ధరియించి కుమారసింహుని నమ్మించి యాతనినివశపఱచుకొనుటకు నీవుతక్క మఱొక్కరు సమర్థులుగారు. నామాటకడ్డుఁ జెప్పకుమని" నన్నునిర్బంధించినపుడు కలిగిన నావిస్మయానందముల కంతులేదు. ఓహో! ప్రియుడౌషధముత్రాగు వేళయైనది. (కుమారుని లేపి) మనోహరా! ఈమాత్రనుమ్రింగుడు. (మ్రింగించును.)

కుమార—(కనులవిప్పి) హా! యేమిది! కలయానిక్కువమా? నాప్రక్కన గూరుచున్నది నామనోహరయగు యేకవీరయేనా? విశ్వసింపవచ్చునా?

ఏక—జీవితేశ్వరా! సంశయింపఁబనిలేదు. నేనేకవీరనే.

కుమార—ప్రియా! నాకేదియుగోచరించుటలేదు. ఇపుడుమనమెచ్చటనున్నారము. శత్రువులునన్నుఁగొంపోయిరిగదా! ఇచటికెట్లు రాగలిగితిమి? ఈసుందరమందిరంబెవ్వరిది?

ఏక—మనోహరా! ఇయ్యది శత్రుగృహము.

కుమార—ఆ! ఏమి శత్రుగృహమా!

ఆ॥ వె॥ ఇచటిదివ్యదీప • నిచయంబుఁ బొడఁగాంచి
యాత్మలోన హర్ష • మందుచుంటి!
శత్రుగృహమెయైన • చాన! ఖడ్గముఁదెమ్ము
చెండివైతురిపులఁ • జిటికలోన॥

ఏక—ప్రియా! ఆగుఁడాగుఁడు.

గీ॥ హస్తమున ఖడ్గమునుబట్టి • యఖిలరిపుల
సమయఁజేయంగ నిప్పుడు • శక్తిలేదు
కాన బుద్ధిబలంబుచేఁ • గనులఁగప్పి
యిల్లుసేరంగవలె జీవి • తేశ మనము.

మనమిప్పుడు మధురానగరముననున్నారము. ఇటనుండి యేకశిలా నగరమును జేరువఱకు కతిజాగరూకతతో సంచరింపవలెను.

కుమార—మనము మధురానగరమున నున్నారమా? పాండ్యసైనికు లా నన్నుఁగొనివచ్చినది. ప్రియా! ఏకశిలానగరమునందున్న నీవిచటి కెట్లు రాఁగలిగితివి?

ఏక—మీరందఱును మొగిలిచెర్ల కేగినపిమ్మటనుండి నాచరిత్రయందనేక విచిత్రములగు మార్పులు కలిగినవి.

కుమార—ప్రియా! వానినన్నిఁటిని పూసగ్రుచ్చినట్లు చెప్పుము. ఉత్సాహముతో వినియెదను.

ఏక—నేనింటికడ నొంటిరిగ నుంట నెఱిఁగి ప్రతాపదేవుఁడు తనకుమారుఁడగు నాగరాజును నన్ను మోహించవలసినదిగా బోధించి నాకడకు బంచెను. నాగరాజు నాచేత చావుఁదప్పించుకొని పోయి తండ్రితోఁ జెప్పినాఁడు.

కుమార—ఔరా! ప్రతాపదేవా! నీకెంతకండకావరము! నీవునాచేజచ్చుట ముమ్మాటికి నిశ్చయము! సఖి పిమ్మట నేమి జరిగెను?

ఏక—ప్రతాపదేవుఁడంతతోఁ బోనిచ్చెనా! వాఁడు నన్నుతుదముట్టింపనున్నాఁడని వదంతిపుట్టెను. ఆవదంతినివిని యింక నిటనుండగూడదని నిశ్చయించుకొని పురుషవేషమునుబూని మిమ్మెల్లరిని మొగిలిచెర్లలోఁ గలిసికొనవచ్చుఁగదాయని బయలు దేరితిని.

కుమార—పిమ్మట నేమయ్యెను?

ఏక—మార్గమధ్యమునఁ గొందరుభటులు నన్ను నాసహోదరుడగు త్రిపురాంతకునిగ భావించి వారిరహస్య కుటీరమునకుం గొంపోయిరి. నేనును త్రిపురాంతకునివలెనే నటించి తాము నిర్బంధితులగుటయు, మిమ్ముఁగొనిపోవలయునని త్రిపురాంతకుఁ డొనర్చుచున్న విశ్వప్రయత్నములును దెలిసికొనగలిగితిని. పిమ్మట జైనాశ్రమమునుండి పాండ్యరాజునకు త్రిపురాంతకుఁడు తేఁదలంచిన జాబును చాకచక్యపుమాటలతో రంగనికడనుండి సంగ్రహించి యందుకావలసిన మార్పులొనరించి దేవదేవాభిధానమున నీనగరమును ప్రవేశించి పాండ్యరాజును సందర్శించి నాపతాకము నిట నాటఁ గల్గితిని.

కుమార — ఆహా! సుందరీ! నీచారిత్రమత్యంత రమణీయము. అంతవఱకు సరియె. ఇపుడు నీవేకవీరవై బయల్పడి నాకడసంచరించుచున్న దాన వదియెట్లు? శత్రుగృహమున నింతనిర్భయమా?

ఏక — ఆవిషయమై నాలోనాకే నవ్వగుచున్నది. పాండ్యరాజును నేనును తమ దేహస్థితి నారయవచ్చి విరహపరితాపమున గ్రుమ్గుచు తమ రేకవీరా నామమును స్మరింపుచుంటను గంటిమి. అపుడు "తామేరికైన నొక సుందరాకారుఁ డగు రాకుమారుని కేకవీరవేషమును వేసి దాపున నుంచినచోఁ దప్పలేనియెడలఁ గుమారసింహుఁడు జీవించి మనకు సంగ్రామరంగమునఁ దోడుపడి విజయంబు గల్పింపఁ గల్గుటయసాధ్య మగునని నేను పాండ్యరాజుతోఁ బల్కితిని. అందులకాతఁడును దీవ్ర ముగ నాలోచించి "దేవదేవా! నీకన్ననాకీవిషయమునఁ దోడ్పడువా రెవ్వరు? నిజముగ నీకునాయెడల భక్తికలదేని నీవే యేకవీరవై కు మారసింహుని లోఁబఱచుకొమ్మని" పలుభంగుల నిర్బంధపఱచిపం పెను. మీకడనిక నేనేకవీరనై సంచరించుట కేమిభయము?

కుమార — (నవ్వుచు) ప్రియా! నాకునవ్వుటకైన శక్తిచాలకున్నది. నీచ రిత్ర మెంతవిచిత్రము. ఎంతసాహసము! నాకొఱకై నీకెంత కష్టము కలిగెను? నీకు నేనేమి యుపకృతి నొనర్తును?

ఏక — (మందహాసముతో) ఉపకృతుల కేమి? పాండ్యరాజు మిమ్ముఁ దన సైన్యాధిపతిగా నియమించుకొనునఁట. నీకొప్పిదమేనా?

కుమార — కాకేమి? ఆమాత్రముపకారముఁ జేయజాలనా?

దైవమా! నిన్ను నిష్కారణముగ దూరితిని. నీమాయ నెవ్వఁ డెఱుంగఁగలఁడు.

గీ॥ నన్నునిర్బంధితునిఁ జేసి • నావెనీవు!
ధూర్తవర్తనయంచు నిన్ • దూరినాఁడ.
కష్టములయందె సుఖముఁ • గలుగఁజేతు
వనుచు దలపోయనైతి నా • మనమునందు!

శత్రురహస్యములనెల్లఁ దెలిసికొనుట కవకాశమిచ్చిన నిన్ను నిష్కారణముగ నిందించితిని.

ఏక—దయామయుఁడగు భగవానుఁడే దూరమాలోచింపకున్న నిఁక మానవులము మనమెంతవారము!

కుమా—ప్రేయసీ! ముందు కార్యక్రమమును గుఱించి విచారించవలదా?

ఏక—మనోరమణా!

గీ॥ అఖిలజగములకెవఁడు గా • ర్యక్రమంబు
నేర్పఱచి నేర్పుతోడ పా • లించుచుండు
వాఁడె మనదు కార్యక్రమ • భంగిఁగూడ
నెన్నఁడో వ్రాసియే యుండె • నేటిచింత!

అయినను బురుషప్రయత్నముండు టావశ్యకముగాన నాలోచింతము. ప్రస్తుతము భోజనసమయమైనది. పిమ్మట విశ్రాంతిగామాటలాడుకొందము.

(అవనిక జారును)

గద్య.

ఇది శ్రీమద్రమారమణ కరుణావిశేష సంలబ్ధకవితాధురీణ
శ్రీమాన్ దూపాటి కొండమాచార్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్ర విజయంబునందు
తృతీయాంకము.

---



# ఆంధ్ర విజయము.

## చతుర్థాంకము

### 1 రంగము - మేడచావడి.

(రుద్రాంబ, శివదేవయ్య, ప్రతాపదేవుఁడు నాసీనులై యుందురు)

రుద్రాం—(విచారముతో) శివదేవా! మొదట నీమాటల వినక దీర్ఘ యాత్ర కరిగినందులకు ఫలము ననుభవింపవలసివచ్చెఁగదా!

శివ—దేవీ!

చ॥ జరిగినదాని కేటికి వి • చారము ముందిక శాత్రవుల్ విప
త్కరమగు నే యపాయములఁ • గల్పనసేయఁగనున్నవారొ, సు
స్థిరమతి వాని దాటుటకు • సిద్ధముగావలెనమ్మ! లేనిచోఁ
గరము విషాదమందఁగల • కారణమేర్పడు నాంధ్రమాతకున్.

రుద్రాం—(కోపముతో) మంత్రివర్యా!

చ॥ ఇదె కరవాలమూనితి మ • హీతలమం దెవరడ్డమైన, దు
ర్మదుల మహాపరాధుల శి • రమ్ములఁ వ్రక్కలుసేయుదాన నే
నదయతఁ జూచుచుండు మన • ఘా! యిక సైపఁగఁజాల వారలన్
ముదమున యుద్ధయత్నములఁ • బూనెద నూరక మాటలేటికిన్.

గీ॥ కాకతీయ యశశ్చంద్రి • కలు జగాన
నంతటను విస్తరించుటో • యస్తమిలుటో!
తేలవలె, నంతదనుక నే • దింపఁబోను
పైకినెత్తిన కత్తిని • భవ్యచరిత !

శివ—దేవీ! శాంతింపుము. వారలకుఁ గాలము చేరువౌటచేతనే యిట్టి దుర్బుద్ధులు పుట్టుచున్నవి.

గీ॥ దహనశిఖలనుబడి తాము • దగ్ధమగుటఁ
దలపకయె వెల్గు కడకేగు • శలభములటు
మదిని తమ చావుమాటయే • మఱచి యిట్లు
ఆంధ్రులను దాకనెంచిరి • యరులు దేవి !

రుద్రాం—ఇంతటి క్రూరకర్ములు నా సామ్రాజ్యమున నుందురని కల నైనఁ దలంపనైతి, ఆహా! నాఁడు కుమారసింహుఁడు డడ్డుపడి సాయ మొనర్చుటచేతనే గదా నేను మఱల నేకశిలానగరమునఁ బ్రవే శింపఁ గలిగితిని! శివదేవా! కుమారసింహుని గుఱించిన జాడ లిం కెవ్వియు బయల్పడలేదుకదా! ఆతఁడు సజీవుఁడై యుండెనో లేదో!— సామంత భూకాంతుల కెల్లరకును గుమారసింహుని నప్పగింపనిచో వారి వారి ప్రాణములు దక్కవని తెలియఁబఱచియుంటిమిగదా ! నేటివఱ కెవ్వరికడనుండియు జవాబురాకుండుట కేమికారణము?

శివ—అమ్మా! మొన్ననేగదా మనము జాబులనంపియుంటిమి. ఎల్లె నను బాండ్యరాజే మన కుమారసింహునిఁ జెఱఁబట్టియుండునని నా నమ్మకము.

రుద్రాం—నేను నట్టులే తలంచుచున్నదానను. ఆమాట యట్లుండ మన త్రిపురాంతకుఁ డేమయ్యెనో తెలియకున్నదే! ఆతని కీవిషయము తెలిసియుండినయెడల నెట్టులైనను మన కుమారసింహుని మనకుఁ దెచ్చి యీయకుండునా? నాఁడు మొగిలిచెర్లలో మమ్మెల్లరఁ గాపా డిన నూతన పురుషుఁ డాతఁడే యనుకొంటిని. వాఁడెవ్వఁడో సోమ దేవుఁడట. వాఁడు మఱల నాకంటి కగపడఁడయ్యె ! (ఏదియో స్ఫురించుట నభినయించి) ఓహో! మఱచితిని. ప్రతాపదేవా! మన

నగరులో నెచ్చటను యేకవీర కానరాదేమి? ఆమెజాడ నీకేమైనఁ దెలియునా?

ప్రతాప—ఆమె విషయములు నాకేలఁదెలియును? నా కామెతో నేమి పనియున్నది?

రుద్రాం—నే నూరలేని సమయమున నీవామెను కోడలినిగాఁ జేసికొన యత్నింపలేదా?

ప్రతాప—(భయముతో) శ్రీరామ! రామ! నాప్రారబ్ధ మేమోగాని యెట్టి లేనిపోని నిందలువచ్చి నానెత్తిపైనఁ బడుచున్నవి. ఎంతచెప్పి నను వినక—ఆ మూర్ఖుఁడు—నాకొడుకు నాగరాజు ఏకవీరను మోహించి తుదకామెచేఁ దిరస్కృతుఁడై పిచ్చియెత్తి యెచ్చటికో పోయినాఁడు. నేటికిఁ బదిదినములైనది. ఆతఁడెందును గానరా కున్నాఁడు.

రుద్రాం—పాపము! ఎవరిచేనైన వెతకింపలేదా?

ప్రతా—అమ్మా! ఏల వెతకింపవలెను? అట్టివాఁ డున్న నేమి? ఊడిన నేమి? అతఁడు సజీవుఁడై యున్నచో నింక నెన్ని యిట్టి వట్టినిందల మోయవలసివచ్చునో!

రుద్రాం—పోనిమ్ము. ఏకవీర యెచ్చటికిఁ బోయియుండునని యూహింం చెదవు?

ప్రతాప—అమ్మా! తమరున్నచోఁ బుట్టినింటికిఁ బోవుటకు సమ్మతింప రని మీరు తిరిగివచ్చునంతలో తానును దల్లినిఁ జూచివత్తమని పోయియున్నదేమో!

రుద్రాం—ఐన నీవామెను జంపఁ బ్రయత్నింపలేదా?

ప్రతాప—(వడఁకుచు) శ్రీరామచంద్రా! నేనా! నేనా! ఏకవీరనా! చంపఁ బ్రయత్నించితినా! నేనంతటి పాపాత్ముఁడనా! మీకెట్లు తెలిసినది! ఎవరుచెప్పిరి! నమ్మితిరా?

రుద్రాం—ప్రతాపా! నేను విన్నసంగతి నడిగితిని. ఏపాప మెఱుఁగని నీకంత భయమేల?

సేవకుఁడు—(ప్రవేశించి వినయముతో) అమ్మా! బయట నెవ్వఁడో మూగివాఁడు వచ్చినిలఁబడి యున్నాఁడు. నేనేది యడిగినను సంజ్ఞ

లతోఁ జెప్పుచున్నాఁడు. నాకీయుత్తరము నిచ్చినాఁడు. చిత్తగింపుడు,
(జాబునందించును)

రుద్రాం—(జాబును విప్పి చదువుకొని) ఔరా! త్రిపురాంతకా! నీఋణమునెట్లు తీర్చుకొందును. శివదేవా! చూడుము. ఈజాబును చదువుము. మనయూహలెల్ల నిజములైనవి. (జాబునిచ్చును)

శివదేవ—(జాబును గైకొని) దేవీ! సావధానచిత్తవై వినుచుండుము. చదివెదను.

"దేవీ!

తే. గీ. అపుడు మిము నేకవీరాల • యంబువద్ద
నేనె జూ సోమదేవాభి • ధానమునను
శత్రువులనుండి తప్పించి • చనినవాఁడ
నారయుచు నున్నవాఁడఁ గు • మారుజాడ!
భయము వలదమ్మ! యాతండు • పట్టు వడియు
జీవములతోడ నున్నఁట్టి • చెవినిఁ బడియె!
కొలఁది దినముల కతనిఁ దో • డ్కొని ముదమున
వచ్చిసకలంబు నెఱిఁగించు • వాఁడనమ్మ!
రాజ్యమున నెల్ల యెడల దు • ర్మార్గులైన
వైరి వీరుల వ్యూహముల్ • వరుసతోడ
దాటుచున్నాఁడ ననుట సం • తసమెగాని
చెంతఁగల గృహశత్రువు • చేయు కుట్ర
లడఁపఁ జాలని కతన సి • గ్గగుచునుండె
వలయు సర్వంబు సమకూర్ప • వలయు మీరు
వింతలను విందురికముందు • వీనులలర!
ననుచు నీరీతిగాఁ ద్రిపు • రాంతకుండు
పంపు జాబును దయఁ జిత్త • గింపవలయు."

ప్రతాప—(తనలో) ఇదేమి కర్మము! నారహస్యములెల్ల నెట్లు బయల్పడుచున్నవి! అబ్బా! త్రిపురాంతకా। నాకు ప్రాణాంతకముగ దాపురించితివిగదా! నాగృహశత్రుత్వమును నీవెట్లు కనిపెట్టగలిగితివి?

రుద్రాం—మంత్రివర్యా! శివదేవా! ఏమియాలోచించు చుంటివి?

శివ—(ప్రితాపదేవుని వైపు జూచుచు) ఆలోచించుట కేమున్నది. జాబును సాంతముగ వినియున్నారు గదా!

రుద్రాం—శివదేవా! నీయనుమానము నాకుఁదెలియును. జాబునందలి గృహశత్రువిషయమును బట్టి చూడ నింకెట్టి యాలోచనలనైన నతి రహస్యముగఁ జేయవలసినట్లేర్పడియెఁగదా! నీవుమాత్రము భోజనానంతర మొక్కమాఱునన్నుఁ గలిసికొమ్ము. ఇంకపోదమురమ్ము. ప్రితాపా! నీవు నాగరాజును వెతికింపుము. పొమ్ము.

ప్రితా—(తనలో) ఇంతటితో నన్ను వదలినారు. నాకదియే పదివేలు. నాకార్యక్రిమమునకు నేనును సిద్ధపడియెదను.

(అందఱు నిష్క్రిమింతురు)

2. రంగము. అరణ్యము.

( ప్రివేశము. ప్రితాపదేవుఁడు )

ప్రతాప—అక్కటా! త్రిపురాంతకుని విషయమెంత దుర్గ్రాహ్యముగ నున్నది!

గీ. శాత్రవుల కుట్ర లెల్లను ♦ క్షణములోనఁ
దెలిసికొని తెల్పుచున్నాఁడు ♦ దేవికెపుడు
వానిమర్మం బదెంతటి ♦ వాని కేని
యెఱుకపడద య్యొ వానితో ♦ నెట్టులింక!

మొన్న నాతఁడు దేవికి వ్రాసిన జాబులోని గృహశత్రు ప్రసంగము నన్ను గుఱించియేకదా! కానిమ్ము. ఇంత మాత్రముతోనే నేను భయపడుదునని వాని తలంపు కాఁబోలు! ఇప్పుడేమి చేయఁ గలఁడు? జైనస్వామి యొద్దకు స్వయముగానే బయలుదేరెతిని. అన్నిసంగతుల నాతనికి దెల్పి కట్టుదిట్టములఁ జేసెదను. దేవి యుద్ధ ప్రయత్నముజూడ లోకము నెల్ల దిగమ్రింగులాగునఁ గానవచ్చుచున్నది. ఈముండను వదలి పాండ్యసైనికులు కుమారసింహు నేలఁ గొంపోయిరి? అబ్బా! మంచి తరుణము మించిపోయినది. గతించినదానికి చింతించిన లాభమేమి? ఇక నుండి యీముండకు నాపై నమ్మకముండదు. ఏకవీర తిరిగి వచ్చి నాపై నింకేమేమి చెప్పునో! ఆపె జాడగూడఁగానరాకున్నది. ఒకవేళఁబుట్టినిం

టికిం బోయి యుండునా? ఎచ్చటికిఁబోయిన నాకేమి? అది మఱల నిచ్చటికి వచ్చినఁ జూచుకొనియెదను. ఓహో! ఇప్పుడు మాత్రము నాయుద్దేశమున కెట్టి భంగము కలిగినది? బాగు. బాగు. ఎట్టులైనను కుమారసింహుని నంతమొందించి యాతని యన్నయగు నన్నమదేవునికి దేవిపై నాగ్రహముఁ గల్పించి యాంధ్రరాష్ట్రముపై కతనినిగూడ దేవగిరి వారితో దండెత్తి వచ్చులాగునఁ జేయవలయునని గదా మొదటినుండియు నాప్రయత్నము. నాప్రయత్నమిప్పుడేలఁ గొనసాగదు! చెఱయందున్న కుమారసింహునిఁజంపి వేయుమని పాండ్యరాజునకు జాబు వ్రాసెదను. పిమ్మట నావిషయమును రాజమహేంద్రవర ప్రాంతాధికారియు, దేవియల్లుడును కుమారసింహుని యన్నయునగు నన్నమదేవునికిఁ దెలియులాగున నేర్పాటులఁ గావించెదను. అన్నమదేవుడుగూడ విరోధియైన పిమ్మట దేవిని జయించుటెంతపని! యుద్ధరంగమునఁ దోడుపడియెద మనిన మాండలిక ప్రభువులెల్లరును ద్వరపడి ప్రయత్నములలో నుండునట్లేర్పాటుఁ గావింప వలసి యున్నది. మహాసేనా సమన్వితముగ దేవగిరి వారరుదెంచిన నింకఁ గావలసిన దేమున్నది? ఎట్లైనను త్వరలో యుద్ధము సన్నద్ధము కాని యెడల రహస్యములెల్ల నిట్టులే బయల్పడుచుండును. ఇకను త్తరములు వ్రాయఁగూడదని నిశ్చయించుకొని యిచటి విశేషములనెల్ల స్వయముగాఁ దెలిపి వత్తమని జైనాచార్యుని కడ కిదేపయనమైతిని. "శుభస్యశీఘ్రు" మనునార్యోక్తి ననుసరించి నాయీశుభకార్యమును శీఘ్రముగానే నెఱవేర్చెదను. వర్జములు లేకుండఁజూచుకొని శుభలగ్నముననే బయలుదేరితిని. మఱేమియు భయము లేదు. పరుని కంటఁ బడకుండఁ దిరిగివచ్చెదను.

(నిష్క్రమించును)

3 రంగము: రహస్యకుటీరము

(ప్రవేశము: త్రిపురాంతక దేవుఁడు, రంగఁడు)

త్రిపు—రంగా! ఎంతటి పొరపాటు జరిగెను! అక్లైల మోసపోయితివి? ఆనాఁడా రహస్యమగు జైనాశ్రమమునఁ బ్రవేశించి, ఆహవమల్లుఁడనునా

మధేయమున నట నతిజాగరూకతతోఁ బ్రవర్తించి జైనాచార్యుఁడు పాండ్యరాజున కొసంగిన ఆజాబును సంగ్రహించినదాది నేను మధుర కేగి యొకవిచిత్రనాటకము నాడసంకల్పించుకొనియుంటిని. మొగిలిచెర్లకేగి సోమదేవాభిధానమున దేవిని గాపాడి వచ్చునంతలో నెంతపని జరిగినది. "గోరుచుట్టుపై రోకటిపోట"న్నట్లుఁ గుమారసింహుని విషయమై చింతిల్లుచున్న నాకంతకంటె మఱింతచింతఁ గొల్పుచుఁ గష్టపడి సంపాందించిన నాటి జాబొరులచే సంగ్రహింపబడియెను గదా!

రంగ—స్వామీ! ఆజాబుఁగొంపోవుటకై వచ్చినవారలు తాముగాక మఱియొకరని చెప్పుటకు నాకవకాశ మగపడుటలేదు: ఆస్వరూపము ను, ఆకంఠస్వరమును వేయేల? అన్నిఁటియందును—ఆజాబునుగొని పోయిన వారికిని మీకును సుంతేనియు భేదము గన్పట్టదు.

త్రిపు—అయ్యో! నాకేకవీరయను నొక్క చెల్లెలు తప్ప సోదరుఁడుఁ గూడ లేఁడే! ఇట్టిదెట్లుసంభవించెను? పోనిమ్ము. జరిగిన దానికేమి చేయఁగలము. రంగా! అతఁడు మనకు మిత్రుఁడో శత్రుఁడో యెట్లెఱుంగనగు?

రంగ—మనకాతఁడు మిత్రుఁడనియే నామనోనిశ్చయము. లేనియెడల నీపాటికే మనరహస్యములెల్ల బయల్పడి మనమెట్టి యిక్కట్టులపాలై యుందుమో! అదియట్లుండ— మిత్రుఁడు కానియెడల జైనాచార్యుని యుత్తరమునం దాతఁడట్లేల మార్పులఁ జేయవలసివచ్చెను?

త్రిపు—(ఆశ్చర్యముతో) ఓహో! ఏమి మార్పులు చేయఁబడినవి?

రంగ—ఆవచ్చిన పురుషుఁడు పాండ్యరాజు కడకేగఁ దలంచి జాబులో "నీయుత్తరముఁదెచ్చిన యాహావమల్లుఁడు మిక్కిలి చాకచక్యముఁ గలవాఁడై నందునఁ ద్రిపురాంతకుని వెతకి పట్టుకొనుటకును జైనభటులకు యుద్ధక్రమము నేర్పుటకును వీనినినా యొద్దనుంచుకొని వీనికి మాఱుగా దేవదేవుని నీకడకుఁ బంపించితి"నని జైనాచార్యుఁడు తెలియపఱచినట్టులుగ మార్చి వ్రాసినాఁడు. ఒకవేళఁ దామె పాండ్యరాజు కడకేగ నిశ్చయించినచోఁ గూడ నిట్టి మార్పుల నొనర్పవలసినదే

కదా! కనుక నీజాబులోని దేవదేవుఁ డీపాటికే మధురానగరమునఁ బ్రవేశించి కుమారసింహునిజాడఁ దెలిసికొని యుండనోపు!

త్రిపు—(ఆలోచించి) రంగా! నీయూహ బాగుగనేయున్నది. ఏదియెట్లైనను మనము జాగ్రత్తతో నుండవలయుననుట విస్పష్టము. (ఏదియో ధ్వనిని విని) ఓహో! యెవ్వరో తలుపు తట్టుచున్నట్లున్నది!

(తెరలో) ఏకవీరా! ఏకవీరా! తలుపుతియ్యి

త్రిపు—రంగా! యెవ్వరో నాచెల్లెలినే గాబోలు "ఏకవీరా" యనిపిలుచుచున్నారు. పోయియాతఁడెవ్వరో యిటకుఁ దీసికొనిరమ్ము.

(రంగఁడు లోనికిఁ బోయిమతిల నాగరాజుతోఁ బ్రవేశించును)

త్రిపు—అబ్బాయీ! నీవెవ్వరు?

నాగ—(పిచ్చినవ్వుతో) నేనా నేనా! నాభార్య యేకవీర! మాయిద్దఱికీ పెళ్లి, నాతండ్రిచెప్పాడు. ఏకవీరఏదీ! మానాన్న చంపేశాఁడా? ముద్దుకోడల్ని చంపేస్తాడా! అమ్మో! నేనులేనూ! ఏకవీరా! మఱేం భయంలేదు తొందరగారా.

త్రిపు—ఓయీ! నీయూరెచ్చట? నీతండ్రి పేరేమి?

నాగ—నావూరా! యీవూరే. ఏకవీరే. ఏకవీరయెక్కడుంటే అక్కడే నావూరు. ఏకవీర నాప్రాణం మేమిద్దరం వొకటి.

త్రిపు—ఓరీ! పిచ్చివానివలె నున్నావే! పోనిమ్ము ఏకవీర యెవ్వరో చెప్పెదవా?

నాగ—చెప్పేదేముంది? ఏకవీరను మోహించమని నాతండ్రి నాతో చెప్పాడు: అమ్మయ్యో, ఇదిగో—ఏకవీర నీవు ఏకవీరవు గావూ ఏకవీరా! ఏకవీరా! ఏదీ ఒక్కముద్దు (త్రిపురాంతకునిమీఁదఁ బడఁబోవును)

త్రిపు—(తొలఁగి) రంగా? వీఁడెవ్వఁడో పిచ్చివానివలె నున్నాఁడు, వీనికి కామపిశాచమేమైన పట్టినదేమో వీని నాగదిలో బంధింపుము. ఈతఁడు స్మరించెడు యేకవిర యెవ్వతెయైనదియుఁ దేలినదాఁక వీనిని వదలఁగూడదు. తీసికొని పోయి బంధింపుము.

రంగ—(నాగరాజును గొంపోయి బంధించివచ్చి) దేవా! ఏమియాలోచించుచున్నారు?

త్రిపు—రంగా! ఆ పిచ్చివాఁడు స్మరించెడి యేకవీర యెవ్వతెయో తోచ కున్నది—ఆమె నా సోదరియై యుండునా ?

రంగ—స్వామీ! ఆతని మాటల ధోరణిలో నొక్కొక్కపరి— ఏకశిలా నగరము రుద్రమదేవి—తండ్రి—బలవంతము— మోహము అను మాటలుగూడ వినవచ్చుచున్నవి.

త్రిపు—అట్లైనచో వీఁడేకశిలానగర వాస్తవ్యుఁ డనుటలో సందేహ మేమున్నది !

రంగ—(ఆతురమున) దేవా ! అదిగో—మలల నేదియో—అటు చూడుడు !

భటులు—(ప్రతాపదేవుని బంధించి తెచ్చి) మహాప్పెబో! దణ్ణాలు. ఈన గారొక పాడుబడ్డ గుళ్ళోనుంచి వత్తుండగా సూశి పట్టుకొచ్చాం బాబు! మాయెంట రమ్మంటే మెల్లగారాక శానా తిప్పలుపెట్టాడు మారాజా! అందుచేత సూడండి యీనవొల్లు బాగా శుద్దిశేశాం.

త్రిపు—ఓరీ! భటులారా! మీరావల నిలఁబడుఁడు. నే నీతని విషయము విచారించెదను. రంగా ! వీని బంధముల విప్పుము.

రంగ—(ప్రతాపదేవుని బంధముల విప్పును)

ప్రతా—(ప్రాణము పోవుచున్న ట్లభినయించును)

త్రిపు—వీఁడేమి జీవించునా ? లేదా ?

భటు—మహాప్పెబో ! ఇదంతా వట్టిదేనండి. వీఁడు శానా టక్కరి బాబయ్యా! ఇట్టాంటి యేసాలేస్తే వదిలిపెడతారేమోననండి.

త్రిపు—అలాగా! (నవ్వుచు) ఓయీ! నీయూ రెయ్యది? నీనామ మెద్ది? ఎచటినుండి యెచ్చటికిఁ బోవుచుండగా మాభటులు నిన్ను బంధించిరి ?

ప్రతా—(ఆయాసముతో) అయ్యా!— నానివాసం, యేకశిలానగరం దగ్గఱ—ఒక పల్లె. నేను చాలా దరిద్రుణ్ణి. నన్ను రామదాసం టారు. నాయనా!—నాకు మూర్ఛలరోగము. ఆంజనేయోపాసన చేస్తే పోతుందన్నారు. అందుచేత రోజూ—ఆపాడు దేవాలయంలో వున్న—ఆంజనేయ విగ్రహానికి ప్రదక్షిణాలు చేసి పోతుంటాను.

కొంచెం నయంగావుంది. ఈరోజుగూడా—అట్లాగే గుళ్లోనుంచి వస్తుంటే—వీళ్ళు నన్ను పట్టుకొని—(కన్నీరుకార్చును)

త్రిపు—ఓయీ! నీకేమియు భయములేదు. దోషివి కానియెడల వదలివేయుదును. నీ సమాచారమునెల్ల సవిస్తరముగఁ జెప్పుము.

నూతన భటుఁడొకఁడు—(ప్రవేశించి పట్టరాని సంతోషమున) వహ్వా! బాబూ! ఎంతపుణ్యంరా నాయనా యివ్వాళ! బలే. దేవా! మనకింకా యేంకావాలె. ఈ మహానుభావుఁడే ప్రతాపదేవుఁడు. ఈనగారే జైనాచార్యుఁడికి దేవి రహస్యాలన్నీ తెలిపే యోగ్యుఁడు.

ప్రతా—(గుండెలు బాదుకొనుచు) అయ్యో! అయ్యో! నేను ప్రతాపదేవుఁడనా? అయ్యో! ఇదేమి గ్రహచారం—ఎవఁడో ఆరాజద్రోహిని నేనంటా రేంకర్మం. నాప్రారబ్ధమేమో అన్నీ యిట్లాగే తటస్థపడుతున్నయ్యి.

నూతన భటుఁడు—ఏమోయి! ప్రొద్దున లేస్తే యేకశిలానగరంలో తిరుగుతుండేవాడ్ని. నాదగ్గఱనా నీ టక్కులు.

ప్రతా—హరి హరీ! ఎంతగతిపట్టిందిరా బాబూ! శూద్రుడ్ని, రామదాసును, నేను ప్రతాపదేవుడ నంటారు. అయ్యో! నిష్కారణముగ నింత పాపమునకుఁ బాల్పడెదరా?

త్రిపు—(బిగ్గఱగా) ఓరీ! నీవు ప్రతాపదేవుఁడవు గావా?

(తెరలో నాగరాజు)

ఏడీ! ప్రతాపదేవుఁడు! మానాన్న వచ్చాడా! ఏకవీరనుగూడా తెచ్చాడా! పెళ్ళిచేస్తాడా? ఇప్పుడేనా?

త్రిపు—(విని) రంగా! ఆ పిచ్చివాఁడు "నాతండ్రి ప్రతాపదేవుఁ డేఁడీ" యని యడుగుచున్నాఁడు. వానివలన వీని విషయము బయల్పడునేమో.

రంగ—దేవా! ఆతని నిటకుఁ దీసికొనివచ్చెదను. (పోయి నాగరాజుతో మఱల వచ్చును.)

నాగ—(చంకలు గొట్టుకొనుచు)

ఏకవీరకు నాకు కళ్యాణమే
మాకిద్దరికి నేడె వైభోగమే.

(సంతోషాతిశయమునఁ దండ్రిపైఁబడి) నాన్నా! ఒంటరిగా వచ్చావేం, నా యేకవీర యేది? అయ్యయ్యో! నీవామెను నీపొట్ట బెట్టుకున్నావా? ఏకవీరమీద ఆశ వట్టిదేనా యిఁక. అంతకాడికి దాన్ని యెందుకు మోహించమన్నావుమతీ?

ప్రతా—(తనలో) నా ప్రాణమునకు వీని నెక్కడ సృజించితివిరా పాపిష్ఠి విధీ! అయ్యో! ఇపుడేమిత్రోవ!

త్రిపు—ఓయీ!అబ్బాయీ!ఈతఁడు నీతండ్రియేనా? ప్రతాపదేవుఁడేనా?

నాగ—ప్రతాపదేవుఁడేనా అంటారేం, సందేహమెందుకు? మా తండ్రి మాబాబు. ఈనగారే యేకవీరను మోహించమన్నది. ఇప్పుడేం మాట్లాడఁడు.

ఇదిగో! చూసుకోండి! ఒకరిప్పించేదేంది? ఏకవీరను నేనే పెండ్లి చేసుకుంటా. (పరుగెత్తబోవును.)

రంగ—(పట్టుకొని) నీకు పెండ్లి మేమే చేసెదము.

త్రిపు—రంగా! నీకింక సందేహమెందులకు? వీఁడు ముమ్మాటికిని ప్రతాపదేవుఁడే. జిత్తులమారిగావున తప్పించుకొనుట కిట్లు చెప్పుచున్నాఁడు. ఆపాడుగుడియే జైనాశ్రమము. వీఁడచట జైనాచార్యునితో మాటలాడి దేవిరహస్యములఁ దెల్పివచ్చుచుండగా మనభటు లీతనినిఁ జూచి పట్టుకొని నారఁట. వీనిని తనకుమారునితోఁగూడ బంధించి యాగదిలోఁ బడవేసి యుంచుము. నెమ్మదిమీద ననేక విషయములు బయల్పడఁగలవు. ఈతని మూర్ఛసంకటమునకు మనమే యౌషధము నిచ్చెదము పద.

రంగ—(నాగరాజు ప్రతాపదేవుల లోనికిఁ దీసికొని పోవును.)

నూతనభటుఁడు—దేవా! ఈపిచ్చికుఱ్ఱవాడిపేరు నాగరాజు. తండ్రి బలవంతమున నేకవీరను మోహించిన విషయము నేను విన్నంతవరకు సావధానముగా చెప్తాను రండి.

త్రిపు—మంచిది. సేవకులారా! మీరుచాలా గొప్పపనిఁ జేసితిరి. మును ముందు మీవిషయము దేవికిఁ జెప్పి గొప్పబహుమానముల నిప్పించెద. ఇట్టులే కనఁబడిన వారినెల్లఁ బట్టితెండు.

భటులు—చిత్తం. బాబయ్యా. ఇయ్యాళ యింత యిరోధి పట్టుపడేటప్ప టికల్లా మావాల్లంతా చంతోచమై పోయింది.

త్రిపు—మంచిది. ఇట్టి యానందముతోడనే కార్యక్రమమును గొనసాగింపుఁడు. భోజనము వేళయైనది. పోదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

4 రంగము. మహాలు.

(ప్రవేశము. దేవదేవుఁడు)

దేవ—(జేబులోని జాబును చేతఁబట్టిచదువును)

"మనోహరా,

మనోహర సందర్శన మహానందమున వికసితభావము వహించు పద్మినీ సుందరిచందమున, నిన్నసాయంకాలమున మీరాజగన్మోహనాకారమును సందర్శించి, నేనమితానంద హృదయారవిందనైతిని. అప్పటి నుండియు మీప్రతిబింబము నామనోదర్పణమునఁ బ్రతిఫలించుచు నా కన్నులకుఁ గట్టినట్టులేయున్నది. మీదివ్యసుందరమంగళవిగ్రహమును బ్రత్యక్షముగ సందర్శించి, తనివిదీర మీమధురవాగమృతమును గ్రోల నాడెందమాందోళన మొందుచున్నయది. మహేశ్వరీ మనోహరుండగు దేవదేవుఁడు నామనోరథము నెరవేర్చుఁగాక! మీయనుగ్రహమునకై యిట్లు ప్రతిక్షణము నిరీక్షించుచుండు మీచరణదాసి,

మహేశ్వరి."

అనియిట్లు నాకానాఁడు పాండ్యరాజు కుమార్తెయగు మహేశ్వరి తనదాసిచే నంపిన ప్రణయలేఖను జదివినకొలంది నాడెందమున నొకవింతయగు నానందముద్భవిల్లుచున్నది. ఓహో! నాచరిత్ర మెంత విచిత్రముగానున్నది!

గీ॥ అల కుమారునికడ నేనె • యబలనైతి
ఇఁకను బురుషుండనౌచు మ • హేశ్వరికిని
పరమసంతోషమొదఁగూర్ప • వలసెఁగాన
స్త్రీనొ? పురుషుండనో? నాకె • తెలియరాదు!

అదిగో! మఱల నంతఃపురదాసి యొకర్తిటకు వచ్చుచున్నది. విశేషమేమో!

దాసి—(ప్రవేశించి వినయముతో) స్వామీ! నమస్కారము. మహారాజుగారు కేళీకాగారమున నున్నారు. తమ్ము వెంటనే దీసికొని రావలసినదిగా నాకాజ్ఞయిచ్చియున్నారు. దయచేయుఁడు.

దేవ—రాజుగారు కేళీకాగారముననుండి నన్నేలఁ బిలిపింతురు! అంతఃపురస్త్రీలు సంచరించెడు చోటికిఁ బరపురుషుల రమ్మందురా?

దాసి—ఇందు పరపురుషులెవరు? జైనాచార్యునినుండి జాబు వచ్చినదఁట. అందలి విషయములఁగూర్చి యతి రహస్యముగ మాటలాడఁదలచి యేకాంతముగఁ గేళీభవనమునఁ గూరుచుండి నన్ను తమకడకంపినారు. కాన తక్షణమే బయలుదేరుఁడు.

దేవ—(వెలవెలఁబోవుచు తనలో) కొంప మునుగునాయేమి? నారహస్యమెద్దియు బయల్పడలేదుకద? జైనాచార్యుఁడేమి వ్రాసినాఁడో! పోక పోయిన నేమి ముప్పువచ్చునో (ప్రకాశముగ) ఓసీ! అట్లయినచోఁ ద్వరితగతినిఁ బోవలయును. పద. పద.

దాసి—అయ్యా! యిటు యిటు. రండు. త్రోవఁజూపెదను.

(ఇరువురు నిష్క్రమింతురు.)

—* 5 రంగము. కేళికాగారము*—

(దాసియుఁ బిమ్మట దేవదేవుఁడును బ్రవేశింతురు)

దాసి— అయ్యా, తామీయాసనమునఁ గూర్చుండుఁడు. లోనికేగి తమరాక రాజుగారి కెఱింగించి వచ్చెదను. (లోనికేగును)

దేవ—(ఆసనమునఁ గూరుచుండి నివ్వెఱపడుచు) ఆహా! ఏమి యీ కేళికాగార వైభవము!

సీ॥ భవనమెల్లడఁ గూర్ప • బడి యెంతయును మనో
హరత నొప్పెడు నిల్వు • టద్దములును
నానావిధములైన • నవ్యరత్నములతో
నలరుచున్నట్టి ది • వ్యాసనములు

కడుమెత్తనై మోవ • మొదఁగూర్చఁ జాలియం
దంబుగానిటనున్న • తల్పములును
ప్రియుఁడు హర్షంబునఁ • బ్రియురాలితోఁగూడి
యూగెడు బంగారు • టుయ్యేలలును

గీ॥ చిత్రచిత్రంబులైనట్టి • చిత్తరువులు
చూడ నరుదగు వింత వ • స్తువులుఁ గలుగ
నల రతీదేవి శయన గృ • హంబొయనఁగ!
గానవచ్చెడుఁ గేళికా • గారమిపుడు;

ఇచ్చటి యలంకారములనెల్ల వర్ణించుకొనుచుఁ గూరుచుండుట కిది సమయముకాదు. రాజుగారితో మాటలాడి విశేషముల నెఱింగినదాఁక నామనంబునకు స్వస్థత చిక్కదు. (విసుగుతో) దాసి లోనికేగి చాలసే పైనది. ఇంతదనుక తిరిగి రాకుండుటకుఁ గారణమేమైయుండును! పిలిచి చూచెదను. (బిగ్గఱగా) దాసీ! దాసీ!

మహేశ్వరి—(తటాలునఁ బ్రవేశించి నమ్రతతో) మహాత్మా! ఇదే తమ దాసివచ్చె. ఏమి సెలవు?

దేవ—(విస్మయముతోఁ దనలో) పిలువఁబంచినది రాజుగారని యెంత తహతహ పడుచుంటిని! (ప్రకాశముగ) కాంతా! నీవెవ్వతెవు? నీవు నాదాసివెట్లయ్యెదవు?

మహే—గీ॥ దినకరునిరాకకై తన • మనమునందు
ప్రార్థనల సల్పుపద్మినీ • భామభంగి
దేవదేవునికై సదా • దీనయగుచు
వేచిన మహేశ్వరిని నేనె • వినుతచరిత!

ఈతంత్రముచే మిమ్మిచ్చటికి రప్పించినందులకు క్షమింపవేడెదను.

దేవ—మహేశ్వరీ! నీవుదాసిచే నాఁడు పంపిన లేఖను జూచినకొలంది నాకుమిగుల విచారముగలుగు చున్నదిసుమా!

మహే—ఏమి? విచారమా! విచారమున కందేమున్నది?

దేవ—ఏమున్నదా? వినుము.

గీ॥ పాండ్య భూపాలునంతటి • వానికీవు
పుత్రికవు; నేనొసామాన్య • పూరుషుండ!
నన్నుఁ గోఁతివౌ ప్రాణ • నాథుగాఁగ
భృంగమరమొందు సంపెంగకై • భ్రమసినటుల!

మహే—మనోహరా! సర్వవిదులరగు తామిట్లు మాటలాడఁ దగునా?

సీ॥ తిన, వసింపగ,ఁ గట్టు • కొనలేని యల సత్య
వంతుని సావిత్రి • వడసెనేల
దట్టంపు టడవులఁ • దపసిబోలెఁ జరించు
పార్థు సుభద్రతా • వలచెనేల
సౌఖ్యంబులం బాసి • చరియించు నభిమన్యు
శశిరేఖ వరియింపఁ • జాలెనేల?
జోగియై తిరుగాడు • చున్నట్టి దేవదే
వుని మహేశ్వరి వరిం • చెనదియేల?
గీ॥ మనసు కుదిరిన పిమ్మట • మానవతులు
వే ఱికెద్దియు యోచించు • వారుగారు
తమరెఱుంగని చరితముల్ • ధరణిఁ గలవె?
అన్నియు నెఱింగి న న్నిట్టు • లడుగ నేల?

దేవ—సుందరీ! సావిత్రీ సుభద్రాంగనలవలె నీవు నంతటి దానవైనఁ గావచ్చును. నేను మాత్రమర్జునాదులంతటి వీరపురుషుండను గానే!

మహే—ఏలకాఁగూడదు?

గీ॥ దేవదేవుని కరుణ నీ • దేవదేవుఁ
డేల నంతటివాఁడు కాఁ • జాలకుండు!
నింతకును గులకాంత య • దృష్టముననె
గాదె రాజిల్లుఁ బ్రియుని భా • గ్యంబదెల్ల!

దేవ—మహేశ్వరీ! నీ వైదుష్యమునకు మిగుల సంతసించితిని కాని నా యీ సంశయమునెట్లు నివారించెదవు? నీతండ్రియగు పాండ్యరాజు నీకనుజ్ఞ యీయనిదే నీవునన్నెట్టులఁ జెట్టపట్టఁగలవు?

మహే——మనోహరా! మీకట్టిసంశయములతోఁ బనిలేదు. ఎట్టియాటంకములు వచ్చినను మహేశ్వరి తమపాదసేవనుండి తొలఁగనేరదు. ఇయ్యది నిశ్చయము. నా తండ్రిమన్మనోభీష్టము నెఱింగి యానందించి మనఃపూర్వకముగ నన్నుఁదమకు పాణిగ్రహణ మొనరించినచోఁగర ము సంతసించెద. అటులఁగాదా లోకమంతయుఁ బాండ్యరాజ్యమే కాదుగదా!

దేవ——అబ్బా! సుందరీ! నన్నుఁజెట్టపట్టి నీవేమి సౌఖ్యములందఁగలవు. మీఁదు మిక్కిలి విపరీతపుజిక్కులకు లోనయ్యెదవే? ఇంతటనైన నను నీమనసును మార్చుకొని నీకుఁ దగిన రాచకుమారుని మఱియొకరిని వరింపరాదా?

మహే——మనోధవా!

ఆ॥వె॥ మిన్ను విఱిగి భూమి • మీఁద వ్రాలినఁగాని
సకల జగముమాఱి • చనినఁగాని
మనమునందుఁ గోరు • కొనినసాధుని వీడ
నేనుసేయుబాస • నిజమునిజము!

ఒకవేళఁ దమకేమైన నిష్టము లేకున్నను,

దేవ——ఆగు మాగుము. అట్టులనుకొనవలదు.

గీ॥ అమితలావణ్యవతియగు • నట్టివనిత
అందునను రాజపుత్రిక! • యంతరాత్మఁ
గోరివరియించుచుండ నే • కోవిదుండు
సమ్మతింపఁడో చెప్పుమా • జగతియందు!

ప్రేయసీ! నాహృదయము నీయందు లగ్నమైనది. (చేతిలోఁజేయి వైచును)

మహే——ఆహా! యేమి నాభాగ్యము. నాధా! ఈబాస నన్ను వంచించుటకై చేయఁబడినది కాదుగదా! నమ్మకొందునా!

దేవ——ప్రియా! ఇం దసత్య మిసుమంతయు లేదు. చూడుము. కుమారసింహున కౌషధము నీయవలసిన వేళయైనది. మఱల నొకమారు వచ్చి నీతో సావకాశముగ మాటలాడెదను.

మహే——ఈలోపల నాతండ్రితో మన పాణిగ్రహణ విషయమును జెప్పి యాతని యుద్దేశము నెఱింగెదను.

దేవ——అట్లే యొనర్పుము. పోదమురమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

. 6 రంగము. రాజమందిరము.

(పాండ్యరాజ దేవదేవు లాసీనులై యుందురు.)

పాండ్య——అబ్బాయీ! ఏమందువు? కుమారసింహుఁడు సంపూర్ణారోగ్యవంతుఁడయ్యెనా?

దేవ—దేవా! అందులకు సందేహమేమున్నది? ఆతఁడునన్నేకవీరనని యే నమ్మునట్లుచేసి, యెన్నెన్నియో విషయములనుగూర్చి యాతండు ప్రశ్నింపగా యుక్తితో జవాబులఁ జెప్పుచు నెట్టకేలకాతని నారోగ్యవంతునిఁ జేయఁగలిగితిని.

పాండ్య——తాను మనపక్షమునఁ జేరిపోరొనర్పవలయునను ముఖ్యాంశము నాతని కెఱింగించితివా?

దేవ——హెచ్చరించితిని.ఆంధ్రసామ్రాజ్యమందును రుద్రాంబయందునువానికిఁగల యభిమానము నొక్కమాఱు త్రెంపివేయుట కెట్లువీలుపడును?

పాండ్య——నిశ్చయము. అందును వాఁడు వీరాగ్రేసరుఁడుగాని సామాన్యుఁడుగాడుగదా?

సేవ——(ప్రవేశించి వినయముతో) దేవా! రుద్రాంబవద్దనుండి వచ్చిన పురుషుఁడొకఁడు బయట నిలఁబడి యున్నాఁడు.

పాండ్య——వానిని లోనికిఁ దోడ్కొనిరమ్ము.

సేవ——(లోనికిఁబోయి ఛన్నునిఁ దోడ్కొని వచ్చును)

ఛన్ను——(వినయముతో నమస్కరించును)

పాండ్య——ఓయీ! నీపేరేమి? నీవెచ్చటనుండి వచ్చుచున్నాఁడవు?

ఛన్ను——రాజా! నన్ను ఛన్నుఁడందురు. ఏకశిలా నగరము నుండియే వచ్చుచున్నాఁడను.

పాండ్య——అయినచో విశేషములెవ్వి?

ఛన్ను——విశేషములెల్ల దేవిపంపిన యీజాబునందుగలవు. చిత్తగింపుఁడు (జాబునిచ్చును.)

పాండ్య—(చదువుకొని) ఓరీ! సేవకా! ఈ ఛన్నుని దోడ్కొని నీవావ లికిఁ బొమ్ము. మఱలనిప్పుడే పిలిచెదను.

ఛన్నుఁడు & సేవ—(నిష్క్రమింతురు)

దేవ—రాజా! దేవివ్రాసిన విశేషము లెట్టివి?

పాండ్య—ఎంతటి కండకావరమో చూడుము. కుమారసింహునిఁ బట్టినది మనమేనని తనకనుమానమఁట! మనమాతనిని వెంటనే తనకప్పగింపనియెడల నింక ప్రాణములు దక్కవఁట.

దేవ—ఇక్కడతనకంటెఁదక్కువ వారెవ్వరో! దేవా! దీనినిఁబట్టిచూడ దేవి యుద్ధసన్నద్ధయైనట్లు తెలియవచ్చెడిని.

పాండ్య—మనముమాత్ర మూరకుంటిమా! నీవు కుమారసింహుని విషయమైన జాగ్రత్తలోనుండుటచే నీకీరహస్యములనెల్లఁదెల్పుట కవకాశము లేకపోయెను. చూచితివా! ఇచట మనయుద్ధప్రయత్నములన్నియు ముగియుటయేగాక దేవగిరి యాదవులుగూడ బయలుదేరి మనకుఁ దోడ్పడ రానున్నారు.

దేవ—ఆహా! ఇంకేమికావలయును? దేవా! దేవికేమని ప్రత్యుత్తరము వ్రాయఁదలంచితిరి?

పాండ్య—అందు నీయుద్దేశమును ముందు తెల్పుము.

దేవ—ఉద్దేశమున కేమున్నది. కుమారసింహుఁ డిచ్చటనే యున్నాఁడనియు నాతఁడు మాకొసంగఁ బడఁడనియు విస్పష్టముగ వ్రాసెదము. రుద్రమ్మ మనల నేమిచేయఁగలదో చూచెదముగాక!

పాండ్య—దేవదేవా! పౌరుషములో నీవునాకన్నఁ దీసిపోవువాఁడవుగావే! నేనునట్టులే వ్రాయవలయునని తలంచితిని.

దేవ—దేవా! మఱచితిని. దేవికడనుండివచ్చిన ఛన్నునివలన మఱికొన్ని రహస్యములఁ దెలిసికొనవచ్చును. వానిని నామందిరమున కంపుఁడు.

పాండ్య—కుమారా! నీవసాధ్యుఁడవే! ఎట్టియల్పావకాశమునైన నూరకే పోఁగొట్టవే? అట్టులే చేసెదను. ఎవరురా అచ్చట?

సేవ—(ప్రవేశించి) బాబయ్యా? ఏమియాజ్ఞ?

పాండ్య—ఛన్నుని దేవదేవుని మందిరమునకుఁగొనిపొమ్ము. ఆతఁడువచ్చి జాబువ్రాసియిచ్చిపంపఁగలఁడని చెప్పుము. పొమ్ము.

సేవ—చిత్తము. (లోనికేగును.)

దేవ—రాజా! అడుగుటకు మఱచితిని. మనసైన్యమున కధ్యక్షునిఁగ నెవ్వరిని నియమించితిరి? నాకునుగొంతసైన్యము నీయరా?

పాండ్య—అబ్బాయీ! అట్లడిగెద వేమి? నీయిచ్చవచ్చినంత సైన్యమునకు నీవధిపతివిగమ్ము. కుమారసింహునితో మాటలాడి యాతనినిగూడ నేర్పరుప వలసియున్నదిగదా?

దేవ—అట్లైనచో నాతనితోడ మాటలాడివత్తమా?

పాండ్య—సరి. రమ్ము. పోదము.

(నిష్క్రమింతురు)

7 రంగము. సుందరమందిరము.

(కుమారసింహుఁడు పరుండియుండును.)

కుమార—

గీ॥ పరుల చెరసాలఁజిక్కిన • వానినన్నుఁ
గాంచి కరుణించి యెంతో సౌ • ఖ్యమ్ముఁగూర్చి
జీవములనిల్పినాఁడవో • దేవదేవ!
చిత్రమయ్యెడునయ్య నీ • చెయ్వులెల్ల!

మహేశ్వరీ మనోనాథా!

గీ॥ ఎన్నటికో సర్వరిపుల జ • యించి మించి
ఆంధ్ర విజయపతాకంబు • నవనియందు
నాటఁగల్గుట మరియు నె • న్నండొ నాదు
ప్రాణసఖిఁగూడి స్వేచ్ఛగాఁ • బరగుచుంట.

(పాండ్యరాజ దేవదేవులు ప్రవేశింతురు.)

కుమార—(లేచి నిలువఁబడును)

పాండ్య—కుమారసింహా! కూర్చుండుము. నన్నింతకంటె వేఱుమార్గమున గౌరవింపవలసియున్నది. దేవదేవా! నీవీయాసనము నధిష్ఠింపుము.

కుమార—దేవ—పాండ్య—(ఆసీనులగుదురు)

పాండ్య—కుమారా! నీవింతవఱకు నారోగ్యస్థితిలో లేనందున నీకెఱింగింప వలసిన ముఖ్యవిషయములఁ దెల్పనైతిని. ఇప్పుడట్టిస్థితిని దాటితివికదా!

కుమార—దేవా! తమ రెఱింగింపఁదలచిన విషయములు నాకుఁ గ్రొత్తవి కావు. దేవదేవుఁడు నాతో నెన్నియోమాఱులు చెప్పియున్నాడు. అయినను రాజనీతిజ్ఞులరగు తా మొనరించిన రెండు దుష్కార్యములకు మిగుల విచార మగుచున్నది.

పాండ్య—వత్సా! ఆ రెండు విషయము లేవియో తెల్పుము. నీసంశయముల నివారించెదను.

కుమార—రాజా!

ఉ॥ మీరలు శౌర్యవంతులఁట! • మిక్కిలి క్షత్రియవంశమందునన్
పేరుఁ బ్రతిష్ఠలంగనిన • పెద్దల వంశజులంట, అట్టిచో
పౌరుష హీనుబోఁచు మముఁ • బట్టఁదలంచితి రాలయంబులోఁ
జోరుల భంగి దీని మదిఁ • జూచిన దుష్కృతియంచుఁదోఁచదే!

పాండ్య—కుమారా! ఇదియా నీసంశయము! బాగుబాగు. పసివాడవు! లోకానుభవము లేనివాఁడవు గావున నీకిదిలోపముగాఁ గానవచ్చుచున్నది.

గీ॥ శత్రుసంహారమున న్యాయ • శాస్త్రవిధుల
ననుసరింపంగఁ జూచునే • యవనిధవుఁడు
వేటమృగయుఁడు బాణంబు • వేయువేళ
దయఁదలంచుట వింటివే • ధరణి నెందు!
సరి. దానికేమి నీరెండవసంశయమెద్ది?

కుమార—రెండవసంశయమా?

గీ॥ దేవదేవునికట్టుల • దివ్యమైన
ముగ్ధవేషంబు వేయించి • మోసపుచ్చి,

పాండ్య—కాదువినుమయ్య మోసంబు • కాదు! నీదు
ప్రాణరక్షణమునకు ను • పాయమద్ది!

(పకపకనవ్వుచు) ఏకవీరానామస్మరణమున మునిగి తేలుచున్న నీయవస్థనుగాంచి నేనీయుపాయ మాలోచించితిని. తుదకునీప్రాణసంరక్షణము నాచరించితిని. నీకు నేను ప్రాణదాతనైతిని. అందుచే నీవు నా యెడల నెట్టిగౌరవమును జూపెదవో తెలిసికొనియెదను. చూడుము.

గీ॥ మనమునను రుద్రమాదేవి • యనెడుమాట
మఱచి పొమ్మింక నీవు కు • మారసింహ
సర్వసైన్యాధిపతివయి • సకలసౌఖ్య
ములను బొందుచు నిటనిల్వు • మోదమలర!

కుమార—అయ్యా! తమకుఁ గృతజ్ఞతఁ జూపవలసినవాఁడనే కాని

గీ॥ నన్నునమ్మిన దేవి న • న్యాయపఱచి
ప్రియతమంబైన నాయేక • వీరఁబాసి
ఎట్టులుగదూరమగు మీదు • పట్టణమున
నొంటిమైయుండఁగలవాఁడ • నో యెఱుంగ!

దేవ—(ఆతురమునఁ గుమారసింహునికిఁ గనుసైగచేయుచు) మహారాజా! కుమారసింహా! మఱచితిని. నిన్న ఛన్నునివలన రాఁబట్టిన యీరహస్యమును వింటిరా? ఏకవీర కుమారసింహునికై చింతించుచుండ రుద్రాంబ యామెతో "నీవిచటనుండవలదు. నీవుఁగూడఁ గుమారసింహునితోఁగూడ నేగంగలోనో గలసిపొమ్ము" అని పరుషవాక్యముల నెన్నింటినో బలికి పాపమా యేకవీర నేకశిలానగరము నుండివెళ్ళఁగొట్టినదఁట! అందుచే నేకవీర తనపుట్టినింటికిఁ బోయి ప్రస్తుతము వెలనాటిసీమయందున్నదఁట.

కుమార—(రోషముతో) ఛీ, ఛీ, ఎట్టిమాటలు చెవినిబడినవి! రుద్రాంబ యింతటి దుర్మార్గురాలని నేనుగలనైన దలంపనైతి. నాప్రియురాలి నింతపరిభవించిన తరువాత నామెతోనిఁక నాకేమి సంబంధమున్నది. ఛీ. ఛీ. బుద్ధివచ్చునట్లు చేసినది. లోకములో నాకీపెకంటె దిక్కెవ్వరును లేరని తలంచినదికాఁబోలు!

పాండ్య—(మందహాసముతో) కుమారా! రుద్రాంబ గుణగణంబు లింతటనైనఁ దెలిసెనా?

కుమార—రాజా! ఇంకనాదుర్మార్గురాలి నామాక్షరముల నుచ్చరింప కూడదు. పై పెచ్చు పాపముగూడ దాపురించఁగలదు.

పాండ్య—సెబాస్ కుమారా! పౌరుషమన్న నట్లుండవలదా? ఇంక యోచనయేటికి?

కుమార—అయ్యా! యోచనకేమున్నది! నేటినుండి తమకు నేనాశ్రితుఁడ నైతిని. సత్యము. దేవరయెట్టిపనికి నియోగించినను క్షణమాత్ర ములో నిర్వర్తించెదను.

పాండ్య—అట్లైనచో నేటినుండి పాండ్యసైన్యములకెల్లఁ గుమారసిం హుఁడే సైన్యాధిపతియని చాటవచ్చునా?

కుమార—అందుకు సందేహమేమి?

పాండ్య—దేవదేవా! నేఁడెంతటి సుదినము. చూడుము. నీవును గుమా రసింహునికి సహాయసైన్యాధిపతివై పనిచేయుము. మీయిరువురి నాయుధాగారమునకుఁ దీసికొనిపోయి యచటి రహస్యములనెల్లఁ దెలిపి సైనికులకెల్ల మిమ్ముల నెఱింగించివచ్చెద రండు.

కుమార—దేవ—మహాప్రసాదము.

(అందఱునిష్క్రమింతురు.)

—* గద్య *—

ఇది శ్రీమద్రమారమణ కరుణావిశేష సంలబ్ధ కవితాధురీణ
శ్రీమాన్ దూపాటి కొండమాచార్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్ర విజయంబునందు
చతుర్థాంకము.



# ఆంధ్రవిజయము.

## పంచమాంకము

1 రంగము రహస్యాశ్రమము.

(ప్రవేశము త్రిపురాంతకుఁడు, ఛన్నుఁడు)

త్రిపు —ఆహా! ఇంతవఱకును నాజాబును సంగ్రహించుకొనిపోయినవారు మనశత్రుపక్షము లోనివారేమోనని మిగుల తహతహపడుచుంటిని. అట్టియెడ ఛన్నా! నీవు దేవదేవునినుండి తెచ్చియిచ్చిన జాబు నాసంశయములనెల్ల నివారించినది. దేవదేవుఁడెవ్వఁడు? నన్నాతఁడు ప్రప్రథమమునుండి యెఱుంగునఁట. ఎవ్వఁడైననేమి? ఆతఁడాపద్బాంధవుఁడు. నిజమునకు దేవదేవునివలెనే పనిసేయుచున్నాఁడు. సమక్షములో నన్నుఁగలిసికొనిన పిమ్మట తనస్వీయచరిత్రము నెఱుకపఱతునని తెలిపి యున్నాఁడు. అట్టిసమయము కొఱకై నేను నిరీక్షించుచున్నాడను. ఓహో మఱచితిని ఛన్నా! దేవదేవుని జాబులో "మీసోదరియగు నేకవీరకుఁ బ్రాణప్రియుండగు కుమారసింహుని నే నాపత్సముద్రమునుండి రక్షించితిని" అని వ్రాయఁబడియున్నది! ఇదియెట్లు?

గీ. నాదుసోదరి తనప్రాణ • నాథునిఁగుఁ గు
మారసింహుని నేటికిఁ • గోరుకొనెనొ?
ముందు వెనుకల నరయక • పోయెనయ్యొ
అందని ఫలంబులకు నాసఁ • జెందఁదగునె?

ఛన్ను—దేవా! అట్లనెద రేల? కుమారసింహుఁడేకవీరను స్మరింపని నిముసము నాకగపడలేదు. ప్రత్యక్షముగఁ జూచివచ్చితినిగదా!

త్రిపు—అంతటి భాగ్యము లభించునా? కుమారసింహునంతటి పురుష వరేణ్యుఁడు నాసోదరికి లభ్యమగునా? నేనెంతటి ధన్యుఁడను! ఛన్నా! ఏకవీర యేకశిలానగరమున నెందును గానరాకున్నదని విందును. నిజమా?

ఛన్ను—ఎవ్వరు చెప్పిరి? ఏదో రెండుమూడు దినములామె కుమార సింహుని యవస్థకై వగచుచు నెవ్వరికిఁ గానరాకుండుటచే నట్టి వదంతి పుట్టినది!

త్రిపు—అటులనా? అయినసరియె. ఇఁకయుద్ధప్రయత్నముల విషయమై దేవదేవుఁడు నాకుఁ జాల తీవ్రముగ వ్రాసియున్నాఁడు. (జాబును జూచుచు) దేవగిరిసైన్యములు బయలు దేరినవఁట. శాత్రవు లేకశిలా నగరమును ముట్టడింపనున్నారఁట. వ్యవధి లేదఁట. తక్షణమే జైనా శ్రమమును ధ్వంసమొనర్పుమనియు, శత్రువులరాక దేవి కెఱింగింపు మనియు నిందు వ్రాసియున్నాఁడు.

ఛన్ను—స్వామీ! జాగుచేసినఁ గార్యము మించిపోఁగలదు.

త్రిపు—జాగేటికి? రమ్ము రంగనికడ కేగి సర్వమును విచారించెదము.

ఛన్ను—(ఆశ్చర్యముతో) దేవా! రంగఁ డెవ్వరు?

త్రిపు—రంగని నెఱుఁగవా? నాకతఁడు దక్షిణహస్తము.

ఛన్ను—తొలుత నాతని నివాసస్థలమెయ్యది?

త్రిపు—ఏకశిలానగరమే. ఛన్నా! ఏటికటులఁ గ్రుచ్చిగ్రుచ్చి యడిగెదవు?

ఛన్ను—మఱేమియును లేదు. ఏకవీర చెలియగులలిత తన ప్రియుండగు రంగనిజాడ తెలియక మిగులఁ జింతిల్లుచున్నది. ఒకవేళ మీకడ నున్న రంగఁ డతఁడగునాయని యాలోచించుచున్నాఁడను.

త్రిపు—ఛన్నా! సత్యమే. నాకు జ్ఞాపకమువచ్చినది. రంగఁడు పలుమాఱు లు తన చెలియగు లలితనుగూర్చి నాతోఁ జెప్పుచు చూచివచ్చు టకై తనకు సెలవు కావలెనని కోరుచుండెడివాఁడు. కానియిచటి కా ర్యభారము నాలోచించి నేనే యింతదనుక వానికి శెల వొసంగనై

త్రిని. పాపమా లలిత యెంత వాపోవు చున్నదో (విచారముతో) ఆ లలిత నాకడ నిల్చియుండినచో నా యపరాధమును మన్నింపు మని దీనముగ వేడు కొని యుందునుగదా!

ఛన్ను — దేవా? తమరట్లనుకొనవలసిన పని లేదు. లలితకుతనమనోహరుఁడు దేశసేవాసక్తుఁడైయున్నట్లు లింతవఱకును దెలియదు. లేనిచో నామెమ్మాత్రమాతనికిఁ దోడ్పడైయుండదా? ఆమెహృదయమును నే నెఱుంగుదును.

త్రిపు — అట్టి సోదరీ రత్నములంగాంచిన యాంధ్రమాత యెంత యదృష్ట శాలిని!

ఆ॥వె॥ లలితఁబోలినట్టి ♦ లలనామణులనెల్లఁ
గలవు తీరునటులఁ ♦ గనినయట్టి
యాంధ్రమాతకన్న ♦ నరయ భాగ్యఁపురాసి
లేదు జగతియందు ♦ లేదు లేదు॥

ఛన్ను — అయ్యా! తనమనోహరుఁడగపడినచోఁ దెలుపుమని లలితనాకుఁ గొన్ని రహస్యములఁ జెప్పినది. లలిత యదృష్టమున రంగఁడిచ్చోట నేఁ గలడుగాన సర్వము నాతని కెఱిగించెదను. నేఁడిల్లు వదలినది మొదలు నాకన్నియు శుభములే పొడకట్టుచున్నవి.

త్రిపు — ఛన్నా! అదియంతయు నీయదృష్టము. రమ్ము. ప్రేయసీ ప్రణయ సందేశముతోఁగూడ సర్వవిషయములును రంగని కెఱింగించి కార్యక్రమము నిర్ణయించుకొనియెదము. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## 2 రంగము. రాజమందిరము.

(పాండ్యరాజు ఆసీనుఁడై యుండును)

పాండ్య — ఆహా! ఏమినాభాగ్యము! దేవదేవుని సహాయమున, గుమార సింహుఁడు నావైపునకు మఱలినాఁడు. రణరంగమున దేవిసైన్యములఁ ద్రుటిలోఁ ద్రుంపివేయగలఁడు! నాకింక నంతకంటెఁగావలసిన దేమున్నది!

సేవకుఁడు—(ప్రవేశించి) అయ్యా, జైనస్వామియొద్దనుండి యొకఋషికుమారుఁడువచ్చి వాకిట నిలిచియున్నాఁడు: లోనికి రాననుజ్ఞ యిత్తురా!

పాండ్య—తత్క్షణమె తీసికొనిరమ్ము.

సేవ—చిత్తము (లోనికిఁబోయి ఋషికుమారునిఁ దోడ్కొనివచ్చును)

ఋషి—(వినయముతో) దేవా! నమస్కారము.

పాండ్య—ఓరీ! జైనస్వామికడనుండి నీవేమివార్తలఁ దెచ్చితివి?

ఋషి—అయ్యా! ఈ జాబునం దెల్లవిశేషములుగలవు. చిత్తగింపుఁడు.

(జాబునిచ్చును)

పాండ్య—(జాబుచదువుకొని పట్టరాని సంతోషమున) అహ్హాహ్హాహా! బలే. సెబాస్, ఓరీ! నీవిట్టిసంతోషవార్తను దెచ్చినందులకు నీకెట్టి బహుమతినీయవలయునో తోచకున్నదే!

ఋషి—బహుమతులకేమి ముందుచేయవలసిన దానిని యోచింపుఁడు.

పాండ్య—యోచించుటకేమున్నది. కుమారసింహ దేవదేవులింతకు ముందే యాయుధాగారమునకేగిరి. వారికడకేగి యీజాబును జూపి త్రిపురాంతకునిఁ బట్టుకొను విషయము నాలోచింతము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు)

3 రంగము; ఆయుధాగారము

(ప్రవేశము. పాండ్యరాజు. ఋషికుమారుఁడు)

పాండ్య—అరుగో! వారేకుమారసింహ దేవదేవులు. మనరాకనెఱింగి వారిటకరుదేరుచున్నారు.

ఋషి—అయ్యా! వారెవ్వరో నే నెఱుంగవచ్చునా?

పాండ్య—ఆమొదటవచ్చునది కుమారసింహుఁడు. ఆతఁడే మనముఖ్య సైన్యాధిపతి. ఆతఁడభిమన్యునంతటి పరాక్రమముఁగలవాఁడు.

ఋషి—ఆరెండవ వారెవ్వరు?

పాండ్య—ఆతఁడు దేవదేవుఁడు. సహాయసైన్యాధిపతి ఆలోచనయం దాతనికీడువచ్చు వారినెవ్వరిని నేనింతకు మున్ను చూచియుండలేదు!

దేవదేవకుమారసింహులు—(ప్రవేశించి విధేయులై) మహారాజా! నమస్కారములు. తాపసోత్తమా! మావందనముల నందుకొనుము.

పాండ్య—(పకపకనవ్వుచు) శుభమస్తు దేవదేవా! కుమారసింహా!

గీ॥ కాలమెంచుక మంచిది • కానియెడల
కష్టములపైని కష్టముల్ • గలుగుచుండు!
సౌఖ్యదినములు వచ్చిన • సమయమందు
శుభములే తోచునన్నియుఁ • జోద్యమగుచు!

దేవ—లోకానుభవముగల మీరు తెల్పెడివెల్ల వేదవాక్యములె. సందేహము లేదు. కాని దేవా! తమరిప్పుడింతత్వరితముగ వచ్చుటకుఁ గారణమేమి? తమచేతిలోని జాబెచ్చటిది? ఈఋషికుమారుఁడెవ్వరు?

పాండ్య—(పరమసంతోషమున నవ్వుచు) దేవదేవా! మితిమీఱిన సంతోషమున నాకిప్పుడేమియుఁదోచుట లేదు. నేనునీకెన్నఁడో చెప్పియుండలేదా? చూడుము, త్రిపురాంతకుఁ డీకూరితో నంతమందినట్లు లే! (జాబునిచ్చును)

దేవ—(జాబునువిప్పి చదువును)

"చిరంజీవి పాండ్యరాజునకు
జైనాచార్యుఁడు వ్రాసిన సంగతులేమనఁగా:—

వత్సా! మనకు మంచిదినములు వచ్చినవి. నేనుకొన్ని తొందర పనులలో నుండుటచే నీయుత్తరములో ముఖ్యమైన సంగతి యొకటి మాత్రము వ్రాయుచున్నాను. నీవు త్వరపడవలయును, మించిపోయినచోఁ గార్యము లేదు. మధురానగరమునుండి నాయాశ్రమము నకువచ్చు—కాలినడక దారిలో—మీ యూరునకు—ఇరువదిమైళ్ల దూరమున—కొండగుట్టలలో—ఒక తాటియాకుల యింటిలో—తన పరివారముతో—త్రిపురాంతకదేవుఁడు—నివసించుచున్నట్లు నాకు స్పష్టముగాఁ దెలిసినది. వానిని బట్టుకొనుటకు నూర్గురు సైనికులతో నీవు కాని నీ సేనానాయకులలోఁ దెలివితేటలు కలవా రెవ్వరైనఁ గాని, వెంటనే బయలుదేరవలసియున్నది. ఈపని నేనే చేసియుందును గాని

కొన్ని కారణములచే వీలులేకపోయినది. సంగతులన్నియు స్పష్టముగా వ్రాయుటకు నా కిప్పుడు కాలము చాలదు. ఇంకమీఁద నీ యిష్టము. ఉపేక్ష చేయవద్దు.

గ్రహింపవలెను.

“ జైనాచార్యుఁడు, ”

పాండ్య—దేవదేవా! నేను నీతో చెప్పలేదా? జైనాచార్యుఁడు సామాన్యుఁడనుకొంటివా ?

దేవ—(తనలో) దైవమా! త్రిపురాంతకుని రహస్యము నిట్లు బయల్పడఁజేసితివేమి? ఇపు డీ విపత్తునుదాటి యెల్లర మొక్కచోఁ గలియు మార్గమును జూపించు భారముగూడ నీయదియె. (ప్రకాశముగ) దేవా! జాబువిషయమగు సందియము తీరినది. ఈ ఋషికుమారుఁ డెవ్వరో తెలుపరా ?

పాండ్య—దేవదేవా! జైనాచార్యుని యుక్తుల నెఱుంగ శక్యమని తలంచితివా ? పరులెఱుంగకుండఁ దన సేవకున కీ ఋషికుమారుని వేషమును వేసి నీ చేతిలోని జాబు నీతనిచేఁ బంపినాఁడు.

దేవ—ఆహా! ఆతఁ డెంతటి దూరదృష్టిగలవాఁడు. దేవా! ఈ జాబును బట్టిచూడ జైనస్వామి చాల గొప్ప ప్రయత్నములలో నున్నట్లు తెలియవచ్చుచున్నది. అందుచేతనే తానే స్వయముగా త్రిపురాంతకునిఁ బట్టుకొనుట కవకాశములేక మనల నందులకు నియోగించినాఁడు. ఇఁక విలంబమేటికి ?

పాండ్య—విలంబమేమున్నది? బయలుదేరవలసినవా రెవ్వరు? నీనా? నేనా? లేక మన మిర్వురమునా?

కుమారసింహుఁడు—(ఆతురమున) రాజశేఖరా !

ఆ॥ వె॥ ఆజ్ఞయైనయెడల • నమరేంద్రు పురమైన
గెల్చి యీయ నిచట • నిల్చియున్న
సమరరంగభీము • శౌర్యధుర్యుని నన్ను
మఱచిపోవఁదగునె • మానసమున.

ఇట్టి స్వల్పవిషయములోనే తమకు నేను మఱపునకు వచ్చితినా?

పాండ్య—కుమారా! మఱచిపోలేదు. నీ విప్పుడేపోయి నూర్గురి నుత్త మాశ్వికుల నాయత్తపఱచుచుండుము. మేమును వచ్చెదము.

కుమార—[దేవదేవునితో కన్నుమలుపుచు) చిత్తము (లోనికేగును)

దేవ—(తనలో) ఆహా! భగవానుఁడు శత్రుపురమునుండి దాటివేయు టకు మార్గమును గనఁబఱచుచున్నాఁడు. ఇంకభయములేదు. (ప్రకాశముగ) దేవా! మీ సంశయము నాకుఁ దెలియును. కుమారసింహునిఁ బంపు విషయమైకాదా?

పాండ్య—దేవదేవా! నిశ్చయమే. నామనసులోని విషయము నీవెట్లెఱుంగఁ గల్గితివి? అందు నీయుద్దేశమేమి?

దేవ—రాజా! మునుముందు మన కెంతయో సాయమొనర్పవలసి యున్న కుమారసింహునకుఁ బ్రారంభముననే యుత్సాహభంగ మును గావించెదరా?

పాండ్య—(అనుమానముతో) ఎట్లులైన నాతఁడు బయలుదేరుటకు మనఃపూర్వకముగ సమ్మతింపఁజాలకున్నాను..—

దేవ—ఓహో! తమ సంశయ మిప్పుడు నాకు బోధపడినది. ఇదియే సమయమని యాతఁడు మననుండి దాటివేయుననియా? ఏటిమాట! అంతటి విరక్తి కలిగినవానికి— త్రికరణశుద్ధిగఁ దన జీవితకాలము నంతయు సౌఖ్యముగ నిచ్చుటనే గడుపనెంచినవానికి—ఇట్టి పిచ్చి యూహాలు కలుగునా? కల్ల. కలిగినను మాత్ర మెటకేగఁగలఁడు? ఆతఁ డట్టిపనికి సిద్ధమయ్యేనేని చూచితిరా యీ నా కరవాలము! (కత్తిఁజూపును.)

పాండ్య—(సంతోషముతో) సెబాస్. దేవదేవా! అట్లులైన నాకింక సందియములేదు. మీరిరువురునుఁ గలిసిపోయి త్రిపురాంతకునిఁ బట్టుకొని రండు.

దేవ—దేవా! త్రిపురాంతకుఁ డీ మాటెచ్చటికిఁ దప్పించుకొనఁగలడు? చూడుఁడు!

శా॥ ఆదుర్మార్గునిఁ బట్టితెచ్చి తమ పా • దాబ్జంబులంజేర్తు నా
మీఁదన్ నమ్ముఁడు నన్ను నంతదనుఁకన్ • మిథ్యాప్రసంగంబులే

లా! దంభంబు లవేల? యీ ప్రతిన రా • జా! వట్టి దేవైనచో
నీదాసు న్నను దేవదేవు మగవా•నిం గానటం చెంచుఁడీ!

పాండ్య—వత్సా! నీప్రతినకుఁ గరము సంతసించితిని. వ్యవధి లేదు. కుమారసింహునిఁ గైకొని తత్క్షణమె బయలుదేరుము. ఓయీ! ఋషికుమారా! నీవును వీరితోడనే గలిసిపొమ్ము. పోదమురండు.

(అందఱు నిష్క్రమింతురు.)

4. రంగము: కేళికాగారము.

(ప్రవేశము. పాండ్యరాజు మహేశ్వరి.)

పాండ్య—కుమారీ! మహేశ్వరీ! నీకెవ్వరైన బోధించిరాయేమి?

మహే—నాయంతరాత్మయే నాకుబోధించినది.

పాండ్య—ఏమని?

మహే—శ్రీదేవదేవుని నీజీవితేశ్వరునిగఁ గైకొనుమని.

పాండ్య—(తనలో) కానిమ్ము. సామదానభేదదండోపాయముల సక్రమముగ నుపయోగపఱచి చూచెదను. (ప్రకాశముగ) అమ్మాయీ! యుక్తాయుక్త విచక్షణ జ్ఞానములేక నీవిట్లు తొందరపడవచ్చునా?

మహే—తండ్రీ! ఇందయుక్తమేమున్నది?

పాండ్య—నిర్భాగ్యుఁడై పొట్టకూటికి మన వాకిటనున్న దేవదేవుని వరించుట యుక్తమా?

మహే—గర్భదరిద్రుఁడే యగునుగాక!

ఉ. మానసమందుఁ దొల్తనొక • మాన్యుని భర్తగఁగోరి పిమ్మటన్
వానిని మాని వేరొకనిఁ • బట్టఁగఁజూచుటకంటె భూమిపై
మానిని కారయంగ నవ • మానమికెద్దియొ తెల్పుమా పితా!
జ్ఞానవిహీనవీవనక • సత్యము నెమ్మది నూహసేయుమా!

పాండ్య—అమ్మా! ఎందఱెందఱో రాజాధిరాజుల బిడ్డలువచ్చి వేదికల నధిష్ఠించియుండ నానావైభవములతో నీకు స్వయంవరముఁగావింపఁ దలంచితిని. నామాటవిని నీపిచ్చితలంపును వీడుము.

మహే—జనకా! ఇప్పుడు మాత్రము నేను స్వయముగా వరింపలేదా? వేరు స్వయంవర మేటికి?

పాండ్య—(కోపముతో) ఓసీ! పాపీ! ఎన్నిమాఱులు చెప్పినను నాకెదురాడెద వేమి? ఆడుదానికి నీకింత కండకావరమా? ఏమి లోకానుభవము కలదని నాకడనిల్చి నీవిట్లు మాట్లాడ సాహసించితివి? చిరకాలము దేవదేవుని నిట్టులే గౌరవించుచుందునని తలంచితివా? నేనాతని నేటికి చేరఁదీసితినో నీకేమి యెఱుక? అయ్యయ్యో!

గీ. రాజపుత్రాన్వయమున శ్రీ • రాజ్యలక్ష్మి
యవతరించెనటంచు నా • యంతరాత్మ
మోదమందుచు నుంటినో • మూర్ఖురాల!
తుదకు హాలాహలంబవై • తోఁచితిగదె!

ఇంక నీపై దయాదాక్షిణ్యము లేల? వినుము.

గీ. ఇంక నొకరెండు దినముల • కీతలంపు
వీడి చెప్పిన చొప్పున • వినిన సరియె
కానియెడ నిన్ను ముక్కముక్కలుగఁగోసి
కాకులకు గ్రద్దలకుఁ దృప్తిఁ • గలుగఁజేతు.

కనిపెంచిన దోషమున నీమాత్రమైనఁ గరుణించవలసి వచ్చినది. ఇసీ! నీచెంతనుండుటకై నను సిగ్గగుచున్నది. బాగుగ నాలోచించు కొనుము. (లోనికేగును.)

అనుబంధము 11.

మహే—(దీనముగ) అయ్యో! నాతండ్రి నామనోభీష్టమును నెఱవేర్చు ననెడి యాస లడుగంటెను. పైపెచ్చు నాప్రాణప్రియునిపై నీతనికి గల కపటోద్దేశముగూడ తెల్లమయ్యెను. కానిమ్ము. మనమా! ధైర్య మూనుము. జగజ్జనకుఁడు లేఁడా?

గీ. ఆసలడుగంటువేళ ధై • ర్యమునుగొల్పి
నన్నుఁబోలినయట్టి దీ • నలను గాచి
సంతసముఁ గూర్చుటకు సర్వ • శక్తుఁడైన
దేవదేవుండె గలఁడు సం • దియమిఁకేల?

దేవదేవుఁడు—(ప్రవేశించి) సందియమేల? సంశయములనెల్లఁ దీర్ప సంసిద్ధుఁడై దేవదేవుడిచ్చ్చట నే నిల్చియున్నవాఁడు.

మహే—(ఆశ్చర్యముతో) ఏమి! నాభాగ్యము! నామమాత్రోచ్చారణ చేతనే సాక్షాత్కరించిన నాజీవితేశ్వరుఁడు నాకెద్దినమకూర్పఁజాలఁడు.

దేవ—మహేశ్వరీ! నీకును నీజనకునికిని జరిగిన సంభాషణమునెల్ల చాటున నుండి నేనువింటిని. చర్వితచర్వణముగ మఱల నీవునాకావిషయములఁ దెలుప నక్కర లేదు. కాని, ఇప్పుడుత్రికరణశుద్ధిగ నీయుద్దేశమును వివరింపుము.

మహే—మనోహరా! నన్నిన్నిమారులు పరీక్షింప వలయునా? నా మేనున జీవంబులున్నంత దనుక నామొదటి యుద్దేశము మారనేరదు.

దేవ—అట్లయినచో సమయమిప్పుడు మనకు చాల ననుకూలముగ నున్నది. నాతోడ నీవును పాండ్యరాజ్యమునుండి దాటి వేయుటకు సమ్మతించెదవా?

మహే—సమ్మతింపకేమి? అందుకు సందేహమా? మీరునాకడలేకున్న నితరలోకముతో నాకేమి పని యున్నది.

దేవ—ఆ. వె. ఆబల! దాపనేల • నంత మనోధృతి
కలదయేని శిఖను • గలుగువిఱిని
వాడకుండ పాండ్య • వసుధాధిపతినుండి
చేర్త నవలికేను • శీఘ్రముగను.

నీతండ్రి యానతి ననుసరించి త్రిపురాంతకాశ్రమమున కేగనున్న మాతోఁగూడ నిన్నును సౌఖ్యముగ గొంపోగలను. అందులకుపాయమును దెల్పెదరమ్ము. (నిష్క్రమింతురు.)

5 రంగము. జైనాశ్రమ ప్రాంతకాంతారము.

(ప్రవేశము త్రిపురాంతకుఁడు, రంగఁడు, ఛన్నుఁడు)

త్రిపు—రంగా! జైనాశ్రమ విధ్వంస మింత యవలీలగ నగునని నేను కలనైనను దలంపలేదుసుమా!

రంగ — దేవా! తమసముద్యమమునకు భగవానుఁడు తోడగుచున్నాఁడ నుట కింతకంటె వేరేమి తార్కాణ కావలయును?

ఛన్ను — దేశస్థితికెల్ల మూలకారణంబైన యీకుతంత్రపరాయణుఁడు, జైనాచార్య హాతకుఁడు చేతఁజిక్కెను. ఇపుడు విజయసౌధమునకు మనము పునాది వేసితిమనుటలో సందియ మింతయును లేదు.

త్రిపు — (ఏదియో శబ్దమును విని) రంగా! ఆశబ్దమెచ్చటిదో చూడుము.

రంగ — (ముందున కేగిచూచి) దేవా! దేవా, కొంపమునిగినది! మఱల నెవ్వరో హయారూఢులై శత్రువులు వచ్చుచున్నారు. త్వరపడుఁడు త్వరపడుఁడు!

ఛన్ను — (నిదానించిచూచి) మఱేమియు భయము లేదు. ఆవచ్చునదిమన ప్రాణమిత్రులు. శత్రువులు గారు. ముందు కుమారసింహుఁడును వాని వెనుక దేవదేవుఁడును గడురభసమున నిటకరుదెంచుచున్నారు.

త్రిపు — (సంతోషముతో) ఏమి? కుమారసింహుఁడును దేవదేవుఁడునా? నేఁడు మనమెంతటి యదృష్టవంతులము!

కుమారసింహుఁడు — (ప్రవేశించి) బావా! త్రిపురాంతక దేవా! నీయాశ్రమమును విధ్వంసమొనర్చి నిన్నుఁబట్టుకొని శృంఖలాబద్ధునిఁ జేసి, కొనిరమ్మని మాపాండ్యరాజు నన్నును నూదేవదేవునిఁ బంపించి నాఁడు. ఇపుడెట్లు తప్పించుకొనఁగలవు?

త్రిపు — (కుమారసింహుని నాలింగనముచేసికొని) రాజకుమారశేఖరా! నీయిచ్చవచ్చినట్టులఁజేయవచ్చును. దాని కేమిగాని భృత్యుఁడనగు నన్ను "బావా" యనిపిలువఁదగునా? ఆహా! కుమారా! నీవు నేఁడు మాతో గలియుట మాయదృష్టము చేత నేసుమీ!

ఉ॥ వైరుల చేతఁజిక్కి పలు • భంగుల గష్టములంది నేటికీ
తీరున దేవదేవుకృప • దీనతఁ బాసి ముదంబుతోడ నే
తేరుట నిశ్చయంబుగ న • దృష్టవశమ్మునగాదె! యింకపై
నారయ నాంధ్రరాజ్యరమ • కన్నియు సౌఖ్యదినంబులయ్యెడున్॥

కుమార — బావా! మఱల మిమ్ముఁ గలిసికొందునని కలనైనఁ దలంప లేదు. దయాళుఁడగు దేవదేవుని కటాక్షమున సముద్ధరింపఁబడి

యెట్టెట్టులో యిటకు రాఁగల్గితిని. నీవొనర్చెడు భూషణలకు నేనెంతమాత్రముఁ దగను. అంతియెకాక,

ఆ॥వె॥ దీక్షఁబూని యాంధ్ర • దేశంబునకుఁగీడు
సేయునట్టి ఖలులఁ • జెండుచున్న
నిన్నుఁగాంచి యిచట • నిల్చియుండుటకేనిఁ
జెల్లునొక్కొ! చెప్పుమ • సిగ్గుగాదె!

దేవదేవుఁడు—(ప్రవేశించి) కుమారసింహా!

గీ॥ పురుషవేషంబు వేసెడు • తరుణులకును
స్వాంతమునసిగ్గు కల్గుట • సాజమద్ది
అసలె పురుషుండవై జన్మ • మందినట్టి
నీకుసిగ్గేలఁ జెప్పుమా • నీరజాక్ష!

(త్రిపురాంతకునికి నమస్కరించి) స్వామీ! త్రిపురాంతకదేవా! నాడట్లు తమరాశ్రమమున లేనిసమయమున తమ రహస్యమైన జాబును సంగ్రహించుకొని పోయినందులకై నాయపరాధమును మన్నింపుమని స్వముఖమునఁ బ్రార్థింప నాకిప్పుడనుకూలపడినది. క్షమింపవేడెద.

త్రిపు—దేవదేవా! ఎల్లరియపరాధములను క్షమించుటకుఁ దగిన సమర్థుఁడు సర్వేశ్వరుఁడు గలఁడు అదియటుండనీయుదంతము నెఱుంగ నువ్విళ్లూరుచున్న నాకు నీ చరిత్ర నంతయుఁ దెలుపవేడెదను.

దేవ—అయ్యా, నావిచిత్రచరిత్రను విని యానందింప గల సుదినములు ముందు కలవు. ప్రస్తుతము వెనుకనుండి తరుముకొని వచ్చుచున్న శత్రుసేనా పరంపరల నడ్డునేయు మార్గము నాలోచింపుఁడు.

కుమార—త్రిపురాంతకా! తక్షణమే మనఘన్నని దేవియొద్దకుఁ బంపి కొంత సైన్యమును దెప్పించుట మిక్కిలి యవసరమైనపని సుమా!

త్రిపు—కుమారసింహా? ఈ యాలోచన నాకిదివఱకే తట్టినది. నేడు మనకుఁబట్టువడిన జైనాచార్యునిఁగూడ ఘన్నునితో నేకశిలానగరమునకుఁ బంప నుద్దేశించుచుంటిని.

కుమార-దేవ—(పరమానంద భరితులై) ఆఁ! ఏమి? జైనాచార్యుడే పట్టువడెనా? ఎంతటి యదృష్టవంతులము!

త్రిపు—సందేహమేమున్నది! ఛన్నా! నీవుపోయి జైనస్వామినిఁ దోడి తెమ్ము.

ఛన్న—చిత్తము. (నిష్క్రమించును)

కుమార—బావా! ఎంతటి మహాకార్య మొనరించితివి!

ఉ॥ మాయలమారియై తనకు • మాండలికప్రభులెల్ల సాయమున్
జేయఁగ లోన నించుకయు • చింతవహింపక నాంధ్రమాతక
న్యాయములంబొనర్చు దురి • తాత్ముని జైనునిఁ బట్టినావు! నీ
కేయుపకారమున్ సలుప • నెంచునొ దేవిఋణంబు తీరిపోఁ॥

దేవ—కుమారసింహా! త్రిపురాంతకుఁడుపకృతుల నపేక్షించువాఁడనియా నీతలంపు? ఎన్నటికినిగాదు. అతనికి సహజములగు వీరపురుషోచిత ధర్మముల నాతడాచరింపుచున్నాడు.

త్రిపు—దేవదేవా! ఇందు నేనొనర్చినదేద్ది? దేవదేవునివలె నెల్లరకును దోడుపడి సమస్తమును నీవేచేయుచున్నాఁడవు.

దేవ—నేనుమాత్రమేమిచేసితిని. నాడీరంగఁడు నన్నునిన్నుగాభావించి విషయములనెల్ల విస్తరించిచెప్పి యీలేఖనొసంగుటచే భగవత్కటాక్షమున నింతకథ నడుపఁబడినది, రంగా! నామూలముగఁ ద్రిపురాంతకునివలన నీకుమాటవచ్చియుండునని చాలవిచారించితిని. నన్ను క్షమింపవలయును.

రంగ—అయ్యో! సేవకుని నన్నింతగా నలువురియెదుట భూషింపనేల? తమబోంట్ల కటాక్షముకంటె నే నపేక్షించునదేమున్నది.

కుమార—ఓహో! మఱచితిని. బావా! త్రిపురాంతకదేవా! రుద్రాంబ గృహశత్రువగు ప్రతాపదేవుడు మాచేబట్టువడినాడు సుమా! ఆతడిపుడు మాశిబిరమునందున్నాడు.

త్రిపు—(ఆశ్చర్యముతో రంగనితో) రంగా! ఇదియెట్టిది? నాడుమనచే బట్టువడినవాఁడు ప్రతాపదేవుడుకాడా?

రంగ—దేవా! ఏలకాకుండును? నాగరాజుచేత గూడ రుజువుచేయఁబడియెఁగదా!

కుమార—ఆ నాగరాజా! ప్రతాపదేవుని కుమారుఁడేనా? ఆపిచ్చివాఁడచ్చటి కెట్లువచ్చెను?

రంగ—అయ్యా, అపిచ్చివాఁడేకవీరను వెతకుచు మాకుటీరమునకువచ్చి పట్టుబడినాఁడు.

దేవ—(ప్రక్కకుఁజూపుచు) ఇదిగో! మఱలనెవ్వఁడో యిటువచ్చుచున్నాఁడు,

రంగ—మఱేమియు ప్రమాదములేదు. ఆవచ్చునది మనవెంకన్నయే!

వెంకన్న— (ప్రవేశించి) బాబుల్లారా! మాబాబయ్య త్రిపురాంతకయ్యగారెక్కడున్నారా?

త్రిపు—ఓరీ! వెంకన్నా! అందఱును క్షేమముగ వచ్చినారా? ప్రమాద మెద్దియుఁ దటస్థింప లేదుగద!

వెంకన్న—బాబూ! దణ్ణాలు, ఇంకేముంది?

త్రిపు—ఏమిరా! అట్లనియెదవు? ప్రాణమోస మెద్దియుఁ గలుగలేదుగద,

వెంక—ఏమనమంటారు బాబూ మఱి, అయితే మఱేంప్రాణమోసం లేదు లెండి.

త్రి—అట్లైనచో భయము లేదు. ముఖ్యవిషయముల నెఱింగింపుము.

వెంక—ముఖ్యవిషయమా? ఏంచెప్పమంటారు! చేతిలోచిక్కిన ప్రతాపదేవుఁడు కాస్తా తప్పించుకొని పోయినాఁడు.

త్రిపు—ఏమి! ప్రతాపదేవుఁడు తప్పించుకొని పోయెనా? అదియెట్లు సంభవించెను?

వెంక—ఆరోజు మనమందరం ప్రయాణమవుతుండగా చీకట్లో మెల్లగా కట్లు తెంపుకోని పారిపోయినాఁడు. పోయినవాఁడు తానూరకాపోక తనకొడుకును—నాగరాజును కాస్తా-చేతులారా చంపుకోని పోయినాఁడు బాబయ్యా!

త్రిపు— హరిహరీ! దుష్టుఁడెంతటి పాపమొనర్చెను! తుదకేమయ్యెను?

వెంక—ఏమయ్యేదేముంది, నాగరాజు శవాన్ని కాస్తా ఆగుడిసెలోనే వుంచి గుడిసెను పరశురామప్రీతిఁ గావించి అందరము బయలుదేరి వచ్చాంబాబయా!

త్రిపు—పోనిమ్ము మంచిపనియే చేసితిరి. "అనాధప్రేత సంస్కారాత్ కోటియజ్ఞఫలం లభేత్" అనునట్లు వెంకన్నా! అంతటిఫలమును నీవెంతయవలీలగ సంపాదించితివి?

కుమార—త్రిపురాంతకా! ఇంకేమి! నిజమిప్పుడు తేలలేదా? తప్పించుకొని పోవుచు ప్రతాపదేవుఁడు మాకెదురుపడి మాచేబట్టువడినాఁడు.

త్రిపు—కుమారసింహా! మంచిపనియే జరిగినది.

వెంకన్న—(సంతోషముతో) ఆఁ ఆఁ కుమారసింహుఁడా! బాబూ దణ్ణాలు ఏమిమాయదృష్టం. తండ్రీ! మాకష్టాలన్నీ గట్టెక్కినట్టే. బాబూ! మఱి దేవదేవుఁడఁట! ఆయనగారుగూడా మీతో వచ్చాడానాయనా?

రంగ—వెంకన్నా! ఆప్రక్క నిలువఁబడియున్నవా రెవ్వరనుకొంటివి! ఆమహాత్ముఁడే దేవదేవుఁడు.

వెంక—దణ్ణాలుబాబూ ! నీవేనా తండ్రీ కుమారసింహుణ్ని రక్షించి తెచ్చింది: అక్కడి కందరినీచూచాను. నాకు తృప్తితీరింది.

త్రిపు—రాజకుమారా ! మావెంకన్న యధిక ప్రసంగియని తలంపఁబోకుఁడు. నమ్మకమైన బంటును, అల్పసంతోషియు నగుటచే మా కడ నాతఁడు స్వేచ్ఛగా నుండుటకు సెలవొసంగఁబడినది.

కుమార—అట్లైనచో వెంకన్న మన కాలమును వినోదముగా వెళ్ళబుచ్చు ననుటలో సందియ మేమున్నది?

త్రిపు—కుమారా ! అడుగో ఛన్నుఁడు. జైనాచార్యునిఁ బట్టి తెచ్చుచున్నాఁడు.

ఛన్ను—(జైనాచార్యుని బంధించి తెచ్చి) దేవా ! ఇదే భటుఁడు తమ యాజ్ఞను నెఱవేర్చినాఁడు.

వెంక—(పరమసంతోషమున) జైనాచార్యుఁడా ! జైనాచార్యుఁడా ! ఇఁక నింకేంగావాలె. బాబూ! త్రిపురాంతకయ్యా! అసలే జిత్తులమారియని పేరుఁబడ్డాడుగదా! అటువంటి జైనాచార్యుణ్ని నీవలలో పడేశి పట్టుకున్నావే నీవెంతమొనగాఁడవనవచ్చు బాబూ! ఇక జయించటం లెఖ్ఖా.

దేవ—వెంకన్నా! నీసంతోషమునకు మేరలేకున్నదే! ఆంధ్రవిజయము సమకూరి యెండొరుల విచిత్ర చరిత్రలఁ జెప్పుకొనువేళ నింకెంత సంతసింతువో!

కుమార—(జైనాచార్యునిఁ జూపుచు) ఆంధ్రరాష్ట్రము నాస్వాదింపఁ జూచెడి పాడుకీటకమిదియేనా? సరియె. (జాబువ్రాసి ఛన్నని కిచ్చుచు) ఛన్నా! సత్వరమె రావలయును. ఇచటి విశేషములనెల్ల సవిస్తరముగ దేవి కెఱింగింపుము. పాండ్యరాజు మా మోసము నెఱింగి యీపాటికే బయలుదేఱియుండును. నీ విపుడు కావలసిన భటులనుగూడఁ దీసికొని యీ ఛండాలుని జైనాచార్యుని నేకశిలా నగరకారాగారమున బంధింపుము. యుద్ధము సంపూర్తియైనపిమ్మట దేవి వీని బ్రతుకు విషయ మాలోచింపఁగలదు. భగవంతుఁడు నిన్ను వెన్నంటియుండును గాక! పోయిరమ్ము.

ఛన్న—(వినయముతో) చిత్తము. వాయువేగమునఁ దిరిగివచ్చెదను. (జైనాచార్యునిబట్టి లాగుచు) పాపఫలంబు ననుభవింపకతీరునా! పోదము రమ్ము.

జైనా—అక్కటా! తుద కెట్టిస్థితి వచ్చెను. (అనుబంధము. 12)

ఉ॥ మానసమం దొకింత యను • మాన మెఱుంగక "రుద్రమాంబకుఁ
హాని యొనర్పకుండఁ గను • లార్ప" నటంచుఁ బ్రతిజ్ఞఁజేసి యె
న్నేనియొ హింసలన్ సలిపి • యిప్పుడు దుఃఖముఁజెంద నేమియా
మానునె రాకఁ గష్టములు • మామకకర్మఫలంబు లక్కటా!

ఛన్న—జైనా—(నిష్క్రమింతురు.)

కుమార—త్రిపురాంతకా! దేవదేవా! ఎల్లరమును శిబిరమున కేగుదము రండు. భోజనానంతరము ముందు కార్యక్రమమును గుఱించి విచారించుకొనవలసియున్నది. (అందఱు నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీమద్రమారమణ కరుణావిశేష సంలబ్ధకవితాధురీణ
శ్రీమాన్ దూపాటి కొండమాచార్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్ర విజయంబునందు పంచమాంకము.



ఓమ్.

# ఆంధ్రవిజయము.

## షష్ఠాంకము



1 రంగము: త్రిపురాంతకుని శిబిరము.

(ప్రవేశము: త్రిపురాంతకదేవుఁడు,)

అనుబంధము 13.

త్రిపు—ఆహా! ఆమనోహరసుందరవదనారవింద యెవ్వతెయైయుండును! కుమారసింహుఁడవివాహితుఁడుగదా, ఇఁక దేవదేవుని యర్ధాంగియైయుండునా! అట్లయినచో నామనస్థితి యిట్లు మాఱనేల! పరకాంతయగు నామెపై నిట్టిభ్రాంతిఁగొనుట రవరవాది నరకమునకుఁ ద్రోవ వెదకికొనుట యగునుగదా! అందుచే యింకపై నామెను గూర్చిన తలంపు మఱచి పోయెదను. ఇసీ! మఱచుటకెట్లు సాధ్యపడును!

సీ. అందమై భువనమో • హనమాచు నెగడొందు
సుదతిమోమునఁగల • సోయగంబు
నిడుదలై సుందర • నీరేజములనేలు
నారీశిరోమణి • నయనయుగము

లలితంబులై చిగు • ళ్ళను గేలి యొనరించు
కలకంఠికోమల • కరయుగంబు
సన్నమై సర్వ సం • స్తవనీయమై యొప్పు
మానవతీ సింహ • మధ్యమంబు
గీ. నాతి పాదసూపు గజగమ • నంపుతీరు
లలన పచరించు నవ్వు వెన్నె • లలసొగసు
ముగుదయందలి సౌందర్య • మూర్తి నాదు
హృదయమున నాటిపోయె నిం • కెట్లుమఱతు!

ఆకన్నియ యింతదనుఁక నవివాహితయైయున్న నేనెంతటి యదృష్టవంతుఁడను! హా! యేమి నా వెఱ్ఱితలంపు? అంతటి రూపసియగు రాచపుత్రిక నాయట్టినిర్భాగ్యుని వరింప సమ్మతించునా? ఏమో! ఇంతకును దేవదేవుని కరుణ యెట్లులున్నదో!

వెంకన్న—(ప్రవేశించి) బాబుగారేదో చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నారే. దేని విషయమబ్బా? తోచటం లేదు.

త్రిపు—(నివ్వెఱపాటున) ఆఁ. ఎవరువారు?

వెంక—ఎదురుగా నిల్చున్నవాళ్లను యెవరువారనే అంతభాగ్యం రాకముందే చలాయిస్తున్నావే బాబూ!

త్రిపు—ఓరీ! వెంకన్నా! నీవేనా? ఆలోచనానిమగ్నుఁడనై యుండి నిన్నట్లడిగితిని. దానికేమిగాని ప్రభాతముననే నేఁడు నీమొగమును జూచితిని. ఏమిచిక్కుఁ దెచ్చిపెట్టెదవో?

వెంకన్న—(చంకనందున్న మూటనందించి) ఇదిగో ! ముందీమూట తెచ్చిపెట్టాను. చిత్తగించండి.

త్రిపు— ఈమూట యెచ్చటిది?

వెంకన్న—అదంతా తరువాత. ముందు విప్పిసూడండి.

త్రిపు—(విప్పిచూచి) ఆహా! వెంకన్నా! ఈయమూల్యములైన రాజదుస్తులు నీకెక్కడినుండి వచ్చెను?

వెంక—వాటిని ధరించుకో బాబూ!

త్రిపు—ఓరీ ! వెఱ్ఱివెంకన్నా ! అడిగినదానికిఁ దగిన సమాధానమును జెప్పవేమి? ఈదుస్తులు నీకెక్కడివి?

వెంక—దేవదేవ కుమారదేవు లిచ్చారు బాబయ్యా.

త్రిపు—ఇచ్చి యేమిచేయుమని చెప్పిరి?

వెంక—వీటిని ధరించికొని వెంటనే త్రిపురాంతకదేవుణ్ణి మాగుడారానికి రావలసిందని తెల్పమని చెప్పి పంపారు.

త్రిపు—(ఆలోచించి) కారణమేమైయుండును? తోచకున్నదే. వెంకన్నా! నేను వారికడ కిప్పుడే పోయివచ్చెదనుగాని యీదుస్తులను ధరించుటకు నేనర్హుఁడను గానోయి!

వెంక—ఔనో కాదో! అదంతా నాకెందుకు ? దుస్తులు మీరు వేసుకోకపోతే ఆమాటవచ్చి వెంటనే మాకు చెప్పమని వారు నాతో చెప్పారు. పోయి చెప్పమంటారామరి! వారే స్వయంగావచ్చి తొడిగించుతారు.

త్రిపు—ఓరీ! గొప్పచిక్కుఁ దెచ్చిపెట్టితివే?

వెంక—ఏం చిక్కు బాబయ్యా! మారాజులాగా రాజదుస్తులు తొడుక్కుంటే కళ్లారాచూచి ఆనందించాలని నేను కనిపెట్టుకోనుంటే అట్లా అంటారేం బాబు! శోభనంపెండ్లికొడుకులాగా హాయిగా పోయి మాట్లాడిరాకూడదా?

త్రిపు—ఓరీ! మంచిమహోపకారమే చేసితివి. ప్రొద్దుననే నీమొగముఁ జూచినందులకుఁ దగినఫలము వెంటనే లభించినది.

వెంకన్న—ప్రొద్దున్నే నామొగము చూచేవాళ్లందరికీ యిట్లాంటిశోభనాలే కలుగబోతాయి, బాబూ! తొందరగా దుస్తులు వేసుకోని రమ్మన్నారు. తరువాత మీయిష్టం.

త్రిపు—సరి. వారిమనోరథము నేనేటికిఁ ద్రోసివేయవలయును? పోదము పద.

(నిష్క్రమింతురు.)

---

2 రంగము:— దేవదేవుని శిబిరము.

(ప్రవేశము. త్రిపురాంతక దేవుఁడు)

త్రిపు— ఇచటఁ గుమారసింహ దేవదేవులలో నొక్కరును గానరాకున్నారు. ఒకవేళ లోన నేమైననున్నారేమో! పిలిచెదను. (బిగ్గఱగా) కుమారసింహా! కుమారసింహా!

మహేశ్వరి— (ప్రవేశించి) మనోహరా! కుమారసింహుఁ డింతదనుకఁ దమతో మాటలాడుచునే యుండెనుగదా! తమకుఁ దెలియకుండ నెచ్చటికిఁ బోఁగలఁడు!

త్రిపు— (నివ్వెఱపడుచు తనలో) ఈరమణీశిరోమణి నారూపమునుగాంచి దేవదేవుఁడనని భ్రాంతిఁగొనుచున్నది! (ప్రకాశముగ) కాంతా! నీపలుకులవలన నీవు దేవదేవుని యర్ధాంగివని తెలియవచ్చుచున్నది.

మహే— (మందహాసముతో) నేను దేవదేవుని యర్ధాంగినని తోఁచుటయు నిక్కవమే. అంతకంటె మీరు మీరూపవిశేషమున మహేశ్వరీ జీవితేశులగుటయు నిక్కవమే. ఏమిసరసము లాడెదరు?

త్రిపు— కాంతా! నాస్వరూపమునుగాంచి యేలమోసపోయెదవు? నన్ను దేవదేవునిగా భావింపకుము. నేను త్రిపురాంతక దేవుఁడను.

మహే— ఓహో! మఱలఁ ద్రిపురాంతకాభిధానము నెప్పుడు ధరించితిరి? పోనిండు. మీరు దేవదేవులైననేమి? త్రిపురాంతకదేవులైననేమి? నేను మహేశ్వరినేగదా!

త్రిపు— సుదతీ! దేవదేవుఁడు వచ్చినపిమ్మట నిజము తేలునుగదా! అప్పుడైన నామాట విశ్వసించెదవా?

మహే— మనోధవా! ఏమి యీపరిహాసము. నామనస్సు మాఱునట్టిది కాదు. నన్నుఁ బరీక్షింపనెంచి మఱియొకరికి మీవేషము వేసి తాము నాకడ మాటలాడు సమయమున నిటకు రమ్మనిచెప్పి వచ్చితిరా యేమి?

త్రిపు— (తనలో) ఎట్టి యవస్థవచ్చినది! ఇపుడు నిజముగా దేవదేవుఁడు వచ్చినను వానినిఁగూడ నీమె విశ్వసింపదు కాఁబోలు! ఆపైన దేవదేవుఁడు నన్నెంతదూఱునో! అంతట నూరకుండునా? కుమారసింహు

నకీ విషయముఁ దెలుపఁగలఁడు. కుమారసింహ దేవదేవుల కిరువుర కును విరోధి నైనచో నిక నాగతియేమి? వారెవ్వరును లేనిసమయ మున నేనిట కేలవచ్చితి! (ప్రకాశముగ) రమణీ! కుమారసింహ దేవ దేవులలో నొక్కరును లేని సమయమున నే నిచ్చటికి వచ్చుటయే పొరపాటైనది. క్షమించి సెలవొసంగుము. పోయివచ్చెదను.

మహే—మహేశ్వరిని విడనాడి దేవదేవుఁడెచ్చటి కరుగఁగలఁడు? నేను ను తమవెంటనే వచ్చెదను.

దేవదేవుఁడు—(ప్రవేశించి తనలో) పాప మీయబల రాజమస్తుల ధరిం చిన త్రిపురాంతకునిఁ గాంచి దేవదేవుఁడననియే నమ్మినది! కాని మ్మ! నాకోరిక నెఱవేఱినట్టులే. (ప్రకాశముగ) మహేశ్వరీ! నీవని నట్లు మహేశ్వరిని విడనాడి దేవదేవుఁడెచ్చటికిని పోజాలఁడు కాని యిప్పుడు దేవదేవుని వదలి మహేశ్వరి పరపురుషునివెంటఁ బోఁజూచు చున్నదే! ఇదెట్టి చోద్యము!

మహే—(నివ్వెఱపాటుతో) ఆహా! ఏమి యీభ్రాంతి!

ఉ॥ బాపురె! రూపసంపదను • ఛాయమునన్ తనుకాంతి యందు నా
కీపురుషాగ్రగణ్యులకు • నిర్వరకించుకయేని భేదమున్
జూప నసాధ్యమయ్యెఁ గదుఁ • జోద్యముగా మదిఁదోఁచె నిందునా
కేపురుషుండు భర్తయని • యెట్టుల గుర్తెఱుఁగుదాన దైవమా?

త్రిపు—(భయముతో) దేవదేవా? తామింట లేని సమయమున నొంట రిగ నేనిట కరుదేరుటచే నిట్టిచోద్యము తటస్థమయ్యెను. భగవత్సృ ష్టివిశేషమున మనమిరువుర మేకాకారులమై కానవచ్చుచుండుటచే నికాంత భ్రమించుచున్నది. ఇందులకెల్లఁగారణమనైన నన్ను క్ష మింప వేడుచున్నాఁడను.

దేవ—అయ్యా! క్షమించుటకుఁ దమరేమి యపరాధము నొనరించితిరి? ఇకాంతతనమనో విధి నెవ్వరిని వరించెనో యెవ్వరికెఱుక? ఓరమణీ! స్త్రీమానసము నెవ్వఁడెఱుంగఁగలఁడు?

"గీ॥ ఒకనితోఁగూడి భాషింతు • రొక్కనరునిఁ
జూతురు విలాససంపద • సొంపుగులుక

మఱియునొక్కనిఁ దలఁతురు • మనసులోనఁ
గూర్చు ప్రియుఁడెవ్వఁడో ముద్దు • గుమ్మలకును"

అని భర్తృహరి లోకాను భవములేకయే వ్రాసెనా? అదియును గాక,

గీ॥ భువినరయ సమీపవ • స్తువుల యందె
హితముఁ బొడసూపు చుండెడు • లతయునెలఁత
నమ్మగారాని వనుట ని • క్కమ్మటంచు
నేఁడుబోధించితివి నీవె • నీరజాక్షి!

మహే—(తనలో) ఆహా! వీరిరువురి కంఠధ్వనియు నొక్కటియే. అది యట్లుండ నీతఁడడిగిన దానికిఁ దగిన సమాధానమీయవలయును గదా! (ప్రకాశముగ) అయ్యా! స్త్రీజాతి నెంత చులకనఁజేసి మాటలాడుచున్నారు! బలశాలు రబలలనేమనినను సాగివచ్చునని గాఁబోలును!

గీ॥ సతులపలుభంగులను దూరు • జ్ఞానులెల్ల
సతులకును బుట్టరో వారె • సతులఁగూడి
సౌఖ్యములనందు చుండరో! • సతులెతమకు
నక్కచెల్లెండ్రునయి యుంట • నరయరొక్కొ!

త్రిపు—(తనలో) ఆహా! యేమి యీమానవతివాక్చాతుర్యము! ఏలనో దేవదేవుని ముఖారవిందమునఁ గోపచిహ్నమిసుమంతయుఁ గానరాదు! ఇపు డీతఁ డామె కేమి ప్రత్యుత్తరమిచ్చునో!

దేవ—(తనలో) ఆహా! సుందరీ! స్త్రీల నిచ్చవచ్చులాగున దూరు నవినీతులకొక్క మంచివాతఁ బెట్టితివి. నీవు మానవతీ శిరోమణి వనుటకింత కంటె వేఱుతార్కాణ యనవసరము. (ప్రకాశముగ) తరుణీ! స్త్రీజనమును పురుషులు నిష్కారణముగ దూరుదురా? ఆనాఁడు "మీరు నాతోడలేకున్ననాకీ లోకముతో నింక నేమి పనియున్న" దని పల్కితివే! నేటికితీరున నీబుద్ధి యేలమాఱవలసి వచ్చెను?

మహే—అయ్యా! ఈనాడుమాత్రము నాకేమి మార్పుకలిగినది? మీరెన్ని విషమపరీక్షల నొనర్చిన నేమి? తొలుత నే వీరపూరుషుఁడు

నాహృదయ ఫలకమునఁ జిత్రింపఁ బడియెనో వానిని వీడుదుననుట
కల్ల!

దేవ—అయినచో నట్టివీరపురుషుఁడు మాయిరువురి యందెవ్వరని తలం
చెదవు?

మహే—ముందు నా యీప్రశ్నకు సమాధానమును జెప్పితిరేని మీప్రశ్నకు జబాబు తేలగలదు!

గీ॥ వేసములతోడ నిట్టుల • మోసపుచ్చఁ
జూచెద రిదేలఁ దెల్పుఁడీ • దాచకిపుడు
తొలుత నాహృదయంబును • దొంగిలించి
నట్టి పురుషవరుండు మీ • యందెవండొ!

దేవ—ఓహో; మహేశ్వరీ! ఎంతమాయలాడివి? నీవు గ్రుడ్డిదానవా?
నీవువరించిన పూరుషుడెవ్వడో నీకే తెలియుట లేదా?

కుమారసింహుఁడు—(క్రిందిపద్యమును జదువుచు బ్రవేశించుచు)

మ. రవిచంద్రాదులకాంతి మాసినను దా • రల్ క్రిందుగాడుల్లినన్
భువియెల్లన్ వడిఁ గ్రుంగిపోయినను నం • భోరాసులే డింకినన్
భువనాధీశులువచ్చి మిమ్ముదయతోఁ • బ్రోవంగ నేతెంచినన్
పవనుండొక్కెడవీవ కాగిననుమీ • ప్రాణంబు లేఁ దీసెదన్॥

త్రిపు—కుమారసింహుఁడు క్రోధరక్తలోచనుడై వచ్చుచున్నవాఁడు.
కారణ మేమైయుండునో!

దేవ—కుమారసింహా! ఆగ్రహాయత్తచిత్తుఁడవై వచ్చుచుంటివేల?

కుమార—యేలనా? మాఱు వేషములతో మహేశ్వరికడ సరసములాడు
కొనుచుఁ గూర్చుండుటకిది సమయముగాదుగనుక! శత్రుసేనా పరంపర
లేకశిలానగరమును జుట్టుముట్టెనఁట! ధన్నుఁడు దేవికండయై పోరు
చున్నాఁడట! విలంబమైన మించిపోఁగలదు. ఇదేపోయి శాత్రవుల బరి
మార్చెదము రండు. అమ్మాయీ! మహేశ్వరీ! నీవుతొలుతవరించిన
వీరపురుషుడే నీకుదక్కగలడు. సందియమందకుము రమ్మ. పోదము.

[అందఱు నిష్క్రమింతురు]

3 రంగము. యుద్ధభూమి సమీపమందలి డేరా.

(ఘన్నుఁ డుపచారములఁజేయుచుండ రుద్రాంబ పరుండియుండును)

రుద్రాం—

మ॥ అనిలో శత్రులుగూలి రేనియును నీ • యాంధ్రావనిం గెల్చెదన్
రణరంగంబున నేనె చచ్చినను వీ • రస్వర్గమున్ జేరెదన్
ఘనతన్ జెందెద నెట్టులైన నిచటన్ • కార్యంబు లేదుంటకున్
నను నీవేటికి యిట్టులాపెదవు ఘ • న్నా! ఖడ్గమిమ్మా! దయన్॥

ఘన్ను—బాగు. పదునాల్గుదినంబులు హోరాహోరిగఁ బోరాడి కాయ మెల్లడల గాయములతో నిండియుండ నిప్పుడు రణరంగమున కేగెద ననుటకంటె వేరొండు వింతయెద్దికలదు?

రుద్రాం—(వినుచు) ఘన్నా! అల్లదే! వింటివా మనరణదుందుభి!

మ॥ రణరంగంబునఁ బోరొనర్పునెడ నాం • ధ్రక్షోణిలో జన్మ మె
త్తినవీరుం డలబ్రహ్మకాఁడు గద యే • దేవుండు తానడ్డమై
చను దేరం గమకించె నేనియును లో • జంకింతయుం జెందడం
చును చాటంచెడు దుందుభిన్ వినుమదేఁ • చోద్యంబుగా మ్రోగెడిన్.

ఘన్ను—ఔను అది మన రణదుందుభియే?

రుద్రాం—అట్లయినచో

కం. రణదుందుభి మ్రోతలు న
న్ననికిని రమ్మంచుఁ బిలువ • నకటా! నన్నీ
తనుబాధల గణియింపుచు
పనిలేకయె నిలువుమంచుఁ • బలికెదవేలా?

(లేవఁబోయి కూలును)

ఘన్ను—(ఆపి) అమ్మా! ఇప్పటికి నామాటపాటించి నిలువుము.

రుద్రాం—పోనిమ్ము ఘన్నా! యుద్ధవిశేషములఁ దెల్పుము. వినుచుండెదను.

ఘన్ను—(తేరిచూచి) ఆహా! నేటియీఘోర సంగ్రామంబు నభివర్ణించి చెప్ప నెవ్వరికి శక్యమగును! ఇరుసైన్యములును భయంకరముగఁ బోరాడుచున్నవి. తుదకు విజయలక్ష్మి యెవ్వరిని వరించునో యెట్లు

నిర్ణయింపనగును. ఆపె ధర్మపక్షమునే యవలంబించునెడ నాంధ్ర సామ్రాజ్యమున కెట్టి యిక్కట్టును గలుగనేరదు. పాపకార్య పరాయణులగు యాదవులు పట్టిన పట్టును మాత్రము విడువలేదు! ఇంతకును విధిసంకల్ప మెట్లున్నదో!

రుద్రాం—(వినుట నభినయించి) ఛన్నా! ముందావినవచ్చు ధ్వని యెద్దియో పరికింపుము.

ఛన్ను—అమ్మా! మతేమియున్నది? వెలమలు, కమ్మలు, రెడ్లు, పద్మనాయకులు మున్నగు మన యాంధ్రవీర కుమారులు రణోత్సాహ సంభరితులై సింహగర్జనముల సల్పుచున్నారు. శత్రుసైన్యమున నించుమించుగ సగము నశించెనను సంతసంబున మనవారు తక్కుంగల రిపుసేనల నుక్కడంప నిప్పుడు సమకట్టినారలు! ఆహా! రణరంగంబు నందెల్లయెడల నిరుపక్కల వారిఖడ్గముల సంఘర్షణమున జనించిన యగ్నికీల లెగయుచున్నవి. కత్తులు తుత్తునియ లగుచున్నవి. అయ్యో! యాదవసైన్యములు ప్రాణాశనువదలి విజృంభించినవి. విజృంభించుటయేగాదు అల్లదే! శాత్రవులు ప్రాకారముల గుభిల్లు గుభిల్లునఁ గూలద్రోయుచున్నారలు.

రుద్రాం—ఏమి? ప్రాకారములనే పగులఁగొట్ట నారంభించిరా. ఛన్నా! ఎద్దియో హెచ్చరిక వినవచ్చుచున్న దాలకింపుము.

[తెరలో మహాదేవరాజు]

శా. వీరాగ్రేసరులార! మీరలిటుదో • ర్వీర్యంబుఁజూపెట్టినా
కారా! యీరణరంగమందిపుడు సిం • హద్వారముం జేరినా
రీ రవ్వంతకుఁ బ్రోలుమాలకుడు మీ • కేగెల్పు నిక్కంబు దు
ర్వారోదగ్ర కుఠారధారలను స • ర్వంబుం భువింగూల్పుడీ.

రుద్రాం—ఛన్నా! వింటివా? యాదవప్రభువగు మహాదేవరాజు హెచ్చరిక! (చెవియొగ్గి) ఓహో! మఱలనెద్దియో వినవచ్చుచున్నదే!

(తెరలో నాగచమూపతి)

మ. భయమందంబనిలేదు శాత్రవులయా • ర్భాటంబులంజూచి ని
ర్దయులై బాణశిలాగ్ని వర్షముల మీ • దకేఁ సోకఁగాఁ జేయుఁడీ

పయికిం బ్రాకంగఁ జూచు దుష్టులను వి • ధ్వంసంబుఁ గావింపుఁడీ
జయమీ యాంధ్రులె గాంతురంచనెడు వి • శ్వాసంబుతోఁ బోరుఁడీ!

ఛన్ను—సెబాస్! ఆంధ్రవీరకుమారా! మంచిమాట వచించితివి,
రుద్రాం—ఛన్నా! ఆ కోలాహల మెచ్చటిది?
ఛన్ను—అమ్మా! కోటచుట్టును గలకందకమును పూడ్చుచు శాత్రవు లుత్తరద్వారమును స్వాధీన మొనర్చుకొనుచున్నారు.
రుద్రాం—ఓహో! శాత్రవుల దుండగము లెక్కుడైనవే! అయ్యో! ఇట్టి చో నాకీదుస్థితి యేల సంభవిల్లెను?
ఛన్ను—అమ్మా! మఱేమియు భయములేదు. మనకమ్మసేనానియగు నాగచమూపతియు వెలమ సేనానియగు రుద్రమ నాయకుఁడును తాముున్న దక్షిణ ద్వారముకడ నన్నమదేవుని నియోగించి వారిరువురును శత్రువాహినీ పరంపరల కెదురీదుకొనుచు నుత్తరద్వారమును సమీపించినారరుగో! ఆహా! యేమి వారి రణకౌశలము! కదళీకాంతార విచ్ఛేదముగతి శత్రు సైన్యముల నెంతలో నేలఁగూల్చిరి!

రుద్రాం—ఛన్నా! ఈసమయమునకైన కుమారసింహ త్రిపురాంతకదేవులరుదేరియుండిరేని,
ఛన్ను—అమ్మా! వారిరువురును నూరు వత్సరములు జీవింపగలరు. కారణమేమన మీరనుకొనుచుండగనే సరియైన సమయమునకు శ్రీకృష్ణార్జునులవలె వారిరువురును రణరంగమునఁ బ్రవేశించినారు. ఆహా! వారితోడ తళతళలాడు ఖడ్గరాజంబులఁ జేతఁ బట్టి యెందఱెందఱు నూతన వీరపురుషులు వచ్చుచున్నారు? వీరలెవ్వరోగాని నిశాత శరపరంపరల నెల్లయెడలఁ గురియఁ జేయుచున్నారు!

(తెరలో కలకలానంతరము కుమారసింహుఁడు)

ఉ॥ చేసినదానికిన్ ఫలముఁ • జెందకఁ దప్పునె క్రూరులార మీ
దోసములెల్లఁ బండెనిదె • త్రుంచెద నేఁడు మదీయమైన ఘో
రాసిని, లోననించుక ద • యం గనఁ బోఁడు కుమార సింహుఁడా
యాస మికేల వ్యర్థముగ, • నాంధ్రపురంధ్రిని గెల్వశక్యమే!

రుద్రాం—(ఆనందముతో) ఆహా! కుమారసింహా! నీగంభీర కంఠస్వరం బు నెన్నిదినంబులకు వినఁగల్గితిని! ధన్నా! ఇంక భయములేదు! ఏక వీరాంబ కరుణించి సమయమునకు సాయమొనరించినది!

ధన్ను—అమ్మా! ఏమి మనకుమారసింహుని కరలాఘవము! క్షణక్ష ణో జ్జీవితములై పొంగి పొరలుచున్న శత్రుసేనా తరంగముల నెంత భీభత్సముగఁ జెదరఁ గొట్టివైచుచున్నాఁడు ఆహా! అప్రక్కనే మూఁడ వనేత్రమును దెఱచి యెదుటనున్నవారినెల్ల విదగ్ధ మొనర్చుచున్న ఫాలనేత్రుఁడోయన భయంకరాకారమునఁ జూపట్టుచుఁ దండోప తండంబులుగ వచ్చు శత్రుపరంపరలఁ జెండాడుచున్న మహామహునిఁ ద్రిపురాంతకదేవుని నే కవికుంజరుఁ డభివర్ణింపఁగలఁడు! అహో అతఁ డెద్దియో తెల్పుచున్నాఁడు!

(తెరలో త్రిపురాంతకదేవుఁడు)

ఉ॥ సైనికులార! యాదవుల • సైతము యుద్ధమునందుఁ గూల్పగా
లేని యశక్తు లాంధ్రులని • లేనికళంకముఁ దేక నేఁడు మీ
ప్రాణములైనఁ బాయుటకుఁ • బాల్పడుఁడీ మనమాతృభూమి నె
ల్లైనను శాత్రవాధముల • హస్తములం బడకుండ నిల్పుఁడీ!

రుద్రాం—(మహదానందమున) సెబాస్, తండ్రీ! త్రిపురాంతకా! నీకేమి యుపకృతి నొనర్తునోయి!

ధన్ను—అమ్మా! ఉపకృతుల కేమిచూడుము. కుమారసింహ త్రిపురాం తకదేవులు మఱికొందఱు వీరభటులతో సాయమైవచ్చినందున మన నాగచమూపతియు రుద్రమనాయకుఁడును తదితర వీరపుంగవు లును ద్విగుణీకృతశౌర్యోత్సాహులై పోరాడుచున్నవారు! తాము రప్పించి బురుజులపై కెక్కించిన గవినీలు పలనాటి చరిత్రయందలి వీరరసస్ఫురిత కథావిధానముల నత్యంత మనోహరముగఁ బాడఁదొ డంగినారు. అయ్యవి మనవారి కమిత ప్రోత్సాహకరములై యొప్పు చున్నయవి. ఆంధ్రవీరుల సమరోత్సాహము నెట్లు వర్ణించి చెప్పఁగ లను! ఆహా! ఇంకేమి కావలయును. అమ్మా! ముందునుండియు వెను

కనుండియు శత్రువులు నాశము కాఁబడిరి! అదే! మహాదేవరాజు ధైర్యమును గోలుపోయి సంధిపతాకమును పైకెత్తినాఁడు. శత్రువుల యార్భాటము లుడిగినవి.

రుద్రాం—ఛన్నా! ఇదంతయు నమ్మహాతల్లి యేకవీరాంబ చలువయే!

(తెరలో కుమారసింహుఁడు)

ఉ॥ వీరవరేణ్యులార! భుజ • వీర్యముఁ జూపకుఁడింక శాత్రవుల్
పోరొనరింపలేక రణ • భూమిని సంధిపతాకమెత్తి నా
రూరకవారిఁ జంపుట య• థోచితధర్మముగాదుగాన వే
ర్వేఱుగఁ జెప్పనేటికిటు • వేగమె యుద్ధము నాపివేయుఁడీ!

ఛన్ను—అమ్మా! వింటిరా! కుమారసింహుని హెచ్చరిక! యుద్ధమిప్పటి కాగిపోయినది. శరవర్షములును, శత్రువుల యార్భాటములును తగ్గిపోయినవి. అదుగో! కుమారసింహుఁడు యాదవసైన్యాధిపతి యగు జయదేవునితో నిచ్చటికే వచ్చుచున్నవాఁడు.

కుమార—(జయదేవునితోఁ బ్రవేశించి) ఓశూరశిఖామణులారా! ఆంధ్రసామ్రాజ్యమున కధికారిణియైన శ్రీ రుద్రమాదేవిగా రెచ్చట నున్నారో తెల్పుదురా!

ఛన్ను—అయ్యా! రుద్రాంబగారీశిబిరమునందే విశ్రాంతిఁ జెందియున్నారు. తాము దయచేయుట కెట్టి యాటంకమును లేదు.

కుమార—(సమీపించి) ఛన్నా! నీవేనా? కుశలమేగద? (రుద్రాంబకు నమస్కరించి) అత్తా! నమస్కారము.

రుద్రాం—(మహదానందమున లేవఁబోయి కూలి) తండ్రీ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నిన్నుఁ జూడఁగల్గితినోయి! కుమారా! యిటురమ్ము. నీప్రక్కనే నిలిచియున్నవారెవ్వరు?

కుమార—దేవీ! ఈతఁడు యాదవసైన్యాధిపతియగు జయదేవుఁడు సంధింగోరి దేవగిరిప్రభువగు మహాదేవరాజుగారీతనిని షరతుల నేర్పఱచుకొని రావలసినదిగా తమకడ కంపిరి.

రుద్రాం—షరతులు వేఱుగ నడుగనేల?

గీ॥ కారణము లేకయే కండ • కావరమున
నాంధ్రవీరులఁదాకఁ బ్ర • యత్నపడిరి
కావుననె కోటిద్రవ్యంబుఁ • గానుకఁబెట్టి
పొమ్మనుము లేనియెడదయఁ • బూన నసుము.

జయదేవుఁడు—(తనలో) అక్కటా! ఇంతద్రవ్య మెక్కడనుండివచ్చును? షరతులు కఠినముగా నున్నవే. అయినను చేయునదియుఁ గానరాదు. (ప్రకాశముగ) ఈవిషయము మా రాజుగారికెఱింగించివచ్చెదను. (లోనికేగి మఱలవచ్చి) అమ్మా! మీషరతులు మా కంగీకృతములైనవి.

రుద్రాం—అట్లైనచో యుద్ధమాగినట్లేనని మీ రాజుగారితోఁ జెప్పుము పొమ్ము.

జయ—చిత్తము (నిష్క్రమి)

రుద్రాం—కుమారసింహా! యుద్ధరంగమునఁ బ్రవేశించుట కింతతడవేలఁ జేసితివి?

కుమార—అత్తా! మార్గమధ్యమున మమ్మెదిరించిన పాండ్యరాజ హతకుని నోడించి నిర్బంధితునొనర్చి తెచ్చుసరికి విలంబమైనది.

రుద్రాం—ఏమి? నిన్ను చెఱఁబెట్టిన దుర్మార్గుడగు పాండ్యరాజును బట్టితెచ్చితివా? చాలా సంతోషము. నీవిచిత్రచరిత్ర నంతయు మన ఘన్నుఁడు నాకెఱింగించినాఁడు. మఱచితిని, మన దేవదేవ త్రిపురాంతక దేవులేరి?

కుమార—అత్తా! నీయాజ్ఞకొఱకై నిరీక్షించుచు వారావల నిలిచియున్నారు!

రుద్రాం—అయ్యో! నాయానతికై వేచియున్నారా! అట్లైనచో ఘన్నా! త్రిపురాంతక దేవదేవాదులఁ దోడ్కొని మనయాస్థానమునకురమ్ము కుమారా! ఎల్లరము నొక్కచో సమావేశ మయ్యెదము. పిమ్మట నెల్లరి విచిత్ర చరిత్రల విని యానందించెదను.

కుమార—ఘన్న—చిత్తము. (అవనికజారును.)

4 రంగము. రుద్రాంబ కొలువుకూటము

(ప్రవేశము. రుద్రాంబ, కుమారసింహుఁడు, దేవదేవుఁడు, త్రిపురాంతకదేవుఁడు, మహేశ్వరి, రంగఁడు, ఛన్నుఁడు.)

రుద్రాం—అబ్బాయీ! దేవదేవా! కుమారసింహుని రక్షించి పాండ్య రాజాదుల మర్మములనెల్ల మునుముందుగఁ దెలిసికొని యాంధ్రవిజయమును గల్పించితివి. నీఋణము నెట్లుతీర్చుకొనియెదను?

దేవ—అమ్మా! నేనొనరించిన మహాకార్య మేమున్నది? బ్రహ్మాదుల కెఱుంగరాని జైనాశ్రమమునఁబ్రవేశించి త్రిపురాంతకుఁడచటినుండి సంగ్రహించుకొనివచ్చిన జాబునాధారముగఁ జేసికొనియే నేనీనాటకము నాడగల్గితిని. అందుచేత నాంధ్రవిజయమునకు మూలకారణమైనవాఁడు త్రిపురాంతకుడుగావున నాతనికీ మహేశ్వరినిచ్చి వివాహమొనరించి సత్కరింపుడు.

రుద్రాం—(ఆశ్చర్యనిమగ్నయై) ఓహో! ఇదియేమి? నీవు స్వయముగఁ గష్టించి సంపాదించుకొనిన దివ్యసుందర విగ్రహమును నీవు వీడనెంచితివా?

దేవ—అట్లైనచో నేను నాకొఱకు సంపాదించుకొనిన దివ్యసుందర విగ్రహమును నాకే యిప్పించి న్యాయమును బాలించెదరా?

రుద్రాం—ఇపుడుకాదనినదెవరు? అట్టులే చేసెదను.

దేవ—మువ్మాటికిని మిమ్మునమ్మవచ్చునా?

రుద్రాం—తప్పక నమ్మవచ్చును.

దేవ—అట్లయినచో నేనుమిగుల ప్రయాసపడి సంపాదించి తెచ్చుకొనిన దివ్యసుందర విగ్రహుండగు కుమారసింహుఁడు నాధనమైనట్టులే కదా?

రుద్రాం—(ఆశ్చర్యముతో) ఏమి? కుమారసింహుఁడు నాధనమనుటకు నీ వేకవీరవుగావే?

దేవ—(పై పురుషదుస్తులనుదీసి యేకవీరయై) ఎట్లుకాకుందును? నే నేకవీరనుగానా! (త్రిపురాంతకునకు నమస్కరించి) అన్నా! నాసాహసమునకు మన్నింపుము. నేనే పురుషవేషమున దేవదేవుఁడనై పలు

కష్టములపాలై యీ నాకుమారసింహుని సంపాదించుకొనఁ గల్గితిని. నేఁడు శ్రీమహేశ్వరిని గొనివచ్చితిని. (మహేశ్వరితో) మహేశ్వరీ! నన్ను క్షమించి నీవాగ్దానము ప్రకారము తొలుత నీకంటఁబడి వరియింపఁ బడిన పురుషవరేణ్యుఁడగు నాసహోదరుని త్రిపురాంతక దేవుని గ్రహింతువా?

మహే—(చిఱునవ్వుతో) అంతకంటె నాకుఁ గావలసిన మహాభాగ్య మెుండెద్ది కలదు? వదినా! తుదకు దేవదేవుఁ డొకయబలగా మారె నేమి?

రుద్రాం—అమ్మాయీ! మహేశ్వరీ! ఇకనుండి సౌధాంతర్భాగములఁ గూర్చుండి మీయిచ్ఛవచ్చినట్టులుగ సరసము లాడుకొనవచ్చును. అమ్మా! నేటికి మాయేకవీరమూలమున కాకతియపాండ్యవంశముల కన్యోన్య మైత్రియు బాంధవ్యమును గలిగినవి! ఇయ్యవి యాచంద్ర తారార్కముగ వర్ధిల్లుఁగాగున శ్రీమన్నారాయణునిఁ బ్రార్థించుచున్న దానను! నీతండ్రి ప్రతాపదేవ జైనాచార్యులతోఁగూడ మాచెఱ సాలయందున్నాఁడు. ఆతని కుచిత సత్కారముల నొసంగి తనరాజ్య మునకంపెదను. త్రిపురాంతకా! మహేశ్వరితోఁగూడి సకలసౌఖ్య ముల ననుభవించుచుండుము. నీకెద్దియుఁ గొదువయుండదు.

త్రిపు—అమ్మా! మహాప్రసాదము. సోదరీ! ఏకవీరా! కలలోనైనఁదలంప వని యిట్టి సుకుమారియగు మహేశ్వరిని నాకిడినందులకు నీకెంత యుఁ గృతజ్ఞుఁడను. దేవీ! నాయీకోరికనుగూడ నెఱవేర్ప వేడుచు న్నాఁడను. నాకుఁదోడు నీడయై మన రాష్ట్రమునకుఁ బాటువడిన వారిలో నీరంగఁడు ముఖ్యుఁడు. వీనికి మనము వివాహమొనర్ప వలయును.

రుద్రాం—తప్పకయొనర్తుము.

ఏక—నాచెలియగు లలితామనోనాథుఁడీ రంగఁడేనా యేమి?

త్రిపు—సందేహమేల! ఆతఁడే యీతఁడు. ధన్నుఁడా లలితను బాగుగా నెఱుంగునఁట.

ఏక—ధన్నా! లలిత యెచ్చటను గానరాదేమి?

ఛన్ను—కుమారసింహునిఁ జెట్టపట్టిన పిమ్మట నేకవీరకు లలితయొక్క జ్ఞాపకమునకు వచ్చెను? జ్ఞాపకమువచ్చినను సమక్షమున పురుషవేష మున ఛన్నుఁడై నిలిచియుండ లలితనెట్లు గుఱుతుపట్టఁగలుగును?

రుద్రా—ఛన్నా! నీవే లలితవా? ఆహా! ఒక్కొక్కరి చరిత్ర యెంతవిచిత్ర ముగనున్నది!

ఛన్ను—(పురుషవేషమునుదీసివైచి లలితయగును.)

త్రిపు—రంగా! నీలలిత నీకడనేయున్నది గ్రహింపుము.

కుమార— చెలీ! ఏకవీరా! నీనెచ్చెలి లలిత నీకంటెఁ దక్కువచదువు లేదుసుమా!

రుద్రాం—అబ్బాయీ! స్నేహమూరక పోవునా మఱి. లలితా! రణ రంగమునఛన్నుఁడవైనా కెంతయోసహాయమొనర్చితివి. నీకష్టమునకు ఫలితముగా రంగనిఁ గాన్కగాఁ గొని సురక్షితముగా [illegible]వించుము. రంగా! నీకింకేమి గావలయును?

రంగ— (లలితచేయిఁ బట్టుకొని) అమ్మా! నాకంతకంటె నింకేమికావల యును!

రుద్రాం—అబ్బాయీ! కుమారసింహా! నీవు నీచెలియైన యేకవీరను చేపట్టఁగల్గితివి. త్రిపురాంతకుఁడు మహేశ్వరినిఁ జేరెను. లలిత రంగని సంపాదించెను. శాత్రవులెల్లరును నిర్జితులైరి. మీరెల్లరును సాయమై ఆంధ్రవిజయమును సంపూర్ణమొనరించితిరి. కావలసిన దేమున్నది.

కుమార—అత్తా! భగవత్కటాక్షమున నెల్లరము సురక్షితుల మైతివి. అయిన నిట్లగుఁగాక!

మంగళమహాశ్రీ

సారెకును దేవతలు - చక్కగను వర్షములొ
సంగిదయఁ జూచెదరుగాతన్

ధారుణిని భూపతులు - ధర్మముగ నేలి నిర
తంబు సుఖియించెదరుగాతన్

వైరములమాని నిర - పాయముగ మానవులు
పారముదమందుదురుగాతన్